# ఆంధ్ర సచిత్ర వారపత్రిక



రాగద్వేషాలు
సీరియల్

4-8-78
75 పైసలు

పక్కింటి పార్వతి బోలెడు
ఖర్చుపెట్టి ఇంటికి ఎమల్షన్
పెయింటు వేయించింది
కాని నేను ఖర్చులో
20% పైగా ఆదా చేశాను.

సూపర్ డెకోప్లాస్ట్—
ఎమల్షన్ సౌందర్యానికి
పెట్టింది పేరు




"పార్వతి నన్ను అడిగుంటే ఆమె కూడా ఆదా చేసేది
మా ఇళ్లు 120 చ. మీ. వైశాల్యంతో ఒకేలా
ఉంటాయి. అందంగా కన్పిస్తుందని, ఇంటికి ఎమల్షన్
పెయింటే వేయిద్దామని ఇద్దరమూ అనుకున్నాం.
వేయించాం కూడాను. కాని, ఆమెకు బోలెడు ఖర్చయింది.
నాకు మాత్రం 20% పైగా ఆదా అయింది.
ఎలా అంటారా, అది సూపర్ డెకోప్లాస్ట్ మహాత్యం!"

సూపర్
డెకోప్లాస్ట్

ఏషియన్ పెయింట్స్

CASAP-38-2...

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]
శుక్రవారం : 4-8-'78
కాళయుక్తినామ సం. శ్రావణ శు. పాడ్యమి
**సంపుటము 71 : సంచిక 46**
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక













# ఉత్తరాలు

## సీరియల్

7-7-78వ తేదీ నాటి సంచికపైన 'రాజీ' ముఖ చిత్రం ఆకర్షణీయంగా లేకపోవడం మూలాన మా మనస్సులకు నచ్చలేదు.

సీరియల్ 'మోహనరూప' చాలా బాగుంది. మాదిరెడ్డి సులోచనగారు అభినందనీయులు. కథలు మూడూ ముచ్చటగా యున్నవి. కథానిక 'సంతృప్తి' ఎంతో తృప్తినిచ్చింది. 'పాలాక్షుని డైరీ' శీర్షిక కూడా ఎంతో తృప్తినిచ్చింది.

ఇక 'ఈనాటిపనితాలోకం' శీర్షికలో ఎ. రేవతి గారి "స్కూళ్ళు తెరిచారంటే భయం" అన్న వ్యాసం పర్వాలేదు బాగుంది. కంపాస్ బాక్స్‌లో స్కేలు ఉంటుందని ఈమెకు తెలియదు గాబోలు. సారీ! ఇలా వ్రాశామని ఏమీ అనుకోకండేమీ?

పోతే ఈ వారం 'లోకం పోకడ' ఊమెన్ కార్టూన్‌తో పాటు ఇతర కార్టూన్‌లు కూడా చాలా బాగున్నాయి.

చివరిగా, జి.వి.జి. పేజి రాను రాను రమణీయంగా తయారవుతూ పాఠకులలో ఆసక్తిని పెంచేస్తున్నది.

గంటాడమాళండర్ రెడ్డి, కోటేశ్వరరెడ్డి,
శ్రీపతిరెడ్డి, కమలారెడ్డి, గీతాసుజాతారెడ్డి,
సత్యరూపమురళీదేవి, బరంపురం-1 (ఒరిస్సా)

* * *

నటి రాజీ ముఖచిత్రంతో వెలువడిన (7.7.78) ఆంధ్ర సచిత్ర వార పత్రిక మాకెంతో నచ్చింది.

మోహనరూప సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది. రచయిత్రి మాదిరెడ్డి సులోచనగారికి మా అభినందనలు.

పిల్లా మహాలక్ష్మినాయుడు, ఆర్. చిన్నయ్యనాయుడు, (ఏటికొప్పాక.)

* * *

7-7-78 నాటి సంచికలో నటి రాజీముఖచిత్రం అంత బాగా లేకున్నప్పటికీ ఫరవాలేదనిపించింది. ఈవారం కథలన్నీ బాగున్నాయి. మోహనరూప సీరియల్ నిజంగా మోహనంగానే ఉన్నది. ఈ వారం కార్టూన్‌లు చలే హాస్యాన్ని అందించాయి. పద్మావతి పెళ్ళి పెదకథ ఆరంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది.

ఎస్. ఉపేంద్రనాథ్. (మెదక్)

## కథలు

7-7-78 తేది సంచికలో కలువకొలను సదానందగారి కదనరంగం కథ ఉత్తేజకరంగా వుంది. పౌరాణిక పుపమానాలు, వర్ణనలు, చెప్పేబాణీ రాజారాం గారిని తలపింప చేస్తున్నాయి. అవసరం, ఆకలి అన్నిపనులకీ ప్రేరణ తెగింపూ కలిగిస్తాయన్న జీవితసత్యాన్ని- జీవనసమరంలోని ఆర్భాటాన్ని అద్దం పట్టినట్టు చిత్రించిన రచయితకు అభినందనలు. లతిక, కాంతిపురం, విశా-16

## కథలు

7-7-78 నాటి పత్రికలో రాణీ ముఖచిత్రం మాకు నచ్చలేదు. ఈవారం పత్రిక పూర్తిగా తెల్లపేపర్ ప్రింట్‌లో వెలువడి చాలా అందంగా వుంది. ప్రతివారం మీమా పత్రిక ఇలాగే వెలువడగలదని మా ఆశ! కథల్లో వేదగిరి రాంబాబుగారి "వింతరోగం" కథ చాలా తమాషాగా వుంది. వారికి, ప్రచురించిన మీకు, మా హృదయపూర్వక అభినందనలు.

ఎల్. అన్నాజీరావు. బాబాజీరావు, లక్కరాజు ప్రఫుల్లచంద్ర జయప్రియ.
(జంషెడ్‌పూర్ టాటానగర్)

* * *

నటి రాణీ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ముఖచిత్రం ఏమీ బాగాలేదు. ఎబ్బెట్టుగా ఉంది. 'సంతృప్తి' కథ మాకు సంతృప్తి నివ్వలేక పోయింది. 'మోహనరూప' ప్రతివారం పత్రికని కొనిపించి చదివింప చేస్తోంది. కార్టూన్స్ బావున్నాయి! చిత్రాలు ముద్రించడంలో మీకు మీరేసాటి. ముద్రణ విషయంలో సూ.చిత్రముద్రణ విషయం మాకెంతో సంతృప్తినిస్తుంది పత్రిక. గతసంచిక ముఖచిత్రం 'పుష్పవికాసం' మాకు మనోల్లాసం కలిగించింది.

కల్లెడ శ్యామ్‌రావు, కాటపల్లి కిషన్ శాస్త్రి
(ఉమ్మెడ)

## ధర్మపథం

7-7-78 పత్రిక ముఖచిత్రం బాగాలేదు. 'ధర్మపథం' శీర్షికద్వారా ఆధ్యాత్మికంగా మీరు చేస్తున్న వినూత్న ప్రయోగము చాలా బాగుంది. తన భార్య ఇతర పురుషులతో సరదాగా మాట్లాడితే నేకిలితనంగాను, అదే వేరే స్త్రీ తనతో చనువుగా మాట్లాడితే ఘనాకితనంగాను భావించే పురుషుల వింతమనస్తత్వాన్ని 'వింతరోగం' అను చక్కని కథగా మలచిన రచయితకు నా అభినందనలు. మిగిలిన కథలు చదవాలేదు. కార్టూన్స్ బాగాలేవు.

యమ్. సుధారాణి, ప్రొద్దుటూరు.

## ఈనాటి వనితాలోకం

30-6-78 నాటి పత్రికపై "పుష్పవికాసం"... అబ్బ! ఎంత బాగుందో! ముద్దొస్తున్నాయ్ గులాబీలు. వాటినే చూసి చూసి మాకు విసుగు రాకుండా అప్పుడప్పుడు ఇలా పూవులను కూడా చూసే భాగ్యం కల్పించి, మమ్మల్ని ఆనందింప జేయండి.

"ఈ నాటి వనితా లోకం" (ఆడుగు-పొడుగు సమస్యలు) చాలా చక్కగా వ్రాశారు. ఏ. హేల గారు, వారు వ్రాసిన దాంట్లో ఎంతమాత్రం అసత్యం కన్పించటంలేదు. రచించిన 'హేల' గారికి, ప్రచురించిన మీకు నా కృతజ్ఞతలు.

ఎస్. లత, (వికారాబాద్)

## శీర్షికలు

ఈవారం మీ(మా) రాణీ ముఖచిత్ర వారపత్రిక మాముందు గగనాలనుండి దిగివచ్చి నిలిచింది. సినిమా విశేషాలు, ప్రశ్నావళి. కార్టూన్స్ యథా మామూలే. ఈనాటి వనితా లోకం శీర్షిక చాలా బాగుంది. కానీ శీర్షిక ఉందికదా అని ఈనాటి వనితలు మగవారిమీద ఎక్కువగా వ్రాసేస్తున్నారు. గేయాలు పొత్తిగా లేనందుకు చింతిస్తున్నాం.

కోట వెంకటరమణ, ఏ.కె.విజయ కళ్యాణి
సి. కృష్ణకుమారి, కోట శకుంతల,
కోట శారద, ఎస్.ఆర్ జ్యోతి.
జవరావీధి బరంపురం.2 (గంజాం జిల్లా) ఒరిసా

# నలిగి ఉంటేనే గొప్ప

పోయిన ఏప్రిల్ నెలలో న్యూయార్క్ నగరంలోని బ్లూమింగ్‌డేల్ అంగడివారు భారతదేశం నుంచి దిగుమతి అయిన సన్నని బట్టని మార్కెట్‌లోకి పెట్టి బాగా ప్రచారంలోకి తీసుకు వచ్చారు.

ఈ వస్త్రానికి వంకాయ, పసుపు, దోసకాయ లాంటి పళ్లరసంతో రంగులు వేసి ధరించటం అక్కడ పెద్ద ఫ్యాషన్ అయిపోయింది.

అమెరికా సంయుక్త రోడ్ అయిలాండ్ లో సంస్థవారు ఒక్క బట్టలో నేసిన 50,000 అనుకుంటున్నారుట. మొదలయిన ఒక కొత్త చికాగోలో ఐ. మాగ్నిన్ షాపు ఉంది. అందులో ఇంతకీ ఈ ఫ్యాషన్ పదార్థాలతో తయారు అంటే నేత, సిల్కుని అంతేకాదు అవి దేహాల మీద నున్నగా. నక్కరలేదు. అంటే అవి వదులుగా, అందుకనే "ఈసంవ అంటూ నలిగే బట్టలని "ఐ. మాగ్నిన్" అంగడి నలిగితేనే గొప్ప గుర్తించదు. అన్ని [టవుషర్‌లా] అందరూ పురుష విభేధాలు



ఈ అమ్మాయి పేరు కాల్విన్‌క్లెయిన్ మామూలు నూలు గుడ్డలో కుట్టించు కున్న వదులుగా వున్న యిస్త్రీలేని ముడుతలుపడ్డ దుస్తులను ధరించింది. చింపిరిగా వున్నా చిలిపిగా చూడ గలగటం ఫ్యాషన్!

రాష్ట్రాలలో ఒకటయిన 80 బ్రాంచీలు ఉన్న ఒక సీజన్‌లో ఈ సన్నటి దుస్తులని అమ్మేశామని ఇదంతా అమెరికాలో ఫ్యాషన్‌లో భాగాలు. అనిఒక పెద్ద [ఖరీదయిన] ఈఫాషన్‌కి మంచిపోషణ. ఏమిటి? బట్టలు కృత్రిమ నేసినవి కాకూడదు- మాత్రమే అయివుండాలి. వాటిని వేసుకునే వారి ఇస్త్రీ చేసినట్లు నుంచో ఒక్కమాటలో చెప్పా నలిగిపోయి వేళ్లాడాలి. త్సరం నలిగితేనే గొప్ప" కొనుక్కున్నాడుట ఖాతాదారు. సిద్ధాంతం ఆడమగతేడాలని లాగూలు [పంట్లాములా, వేసుకోవచ్చు స్త్రీ లేకుండా.

ఆర్మానీ అనే ఒక ఇటలీ పెయిలరు అమెరికాలో వదులు, నలిగిన సూట్లని బాగా ప్రచారం చేస్తున్నాడు. అతని సూట్ల వెలలు 475 నుంచి 650 డాలరులదాకా ఉంటాయట. [అంటే నాలుగువేల రెండువందల రూపాయల నుంచి అయిదువేల ఎనిమిదివందల రూపాయలదాకా]

ఇంతకీ నలిగితే గొప్ప ఉద్యమం ఒకరకం స్వాతంత్ర్యోద్యమం అని కూడా కొందరు.

"ఇంకెంత కాలం ఇరుకు ఇస్త్రీ బట్టలలో ఇబ్బంది ఇలాగ?" అని అడుగుతున్నారు పీడిత ప్రజలు అని ఒక వ్యాఖ్యాత. [టయిమ్ పత్రిక వ్యాసం ఆధారంగా.]



# ఒకపిచ్చిదాని కథ

ఊర్వశి

రాత్రి పదిగంటలు దాటినవేళ,

చంద్రుడు రాని ఆ రాత్రి వేళ,

చుక్కల వెలుగు కూడ నేలను తాక టానికి అవకాశము నివ్వక నిప్పుల నిడిగా మేఘాలు నల్లని రంగును పూసుకుని తిరుగాడుతున్న ఆ వేళ, గిటికీలు కొట్టేగాల చెఱువు గట్టును దాటి, మైదానంలొంచి, నగరంలోకి పరుగులు తీస్తూంటే, అంతే వేగంతో ఆ ఊరిలోకి, భుజాన్న పసికందును చిరిగిన చీర పొరల్లో వేసుకుని, ప్రక్కన రెండు మైళ్ళ దూరంలో ఉన్న పల్లెటూరు నుండి ఆందోళనతో నిండిన మనసుతో పరుగెత్తి, అంతటి చలిగాలిలోన్నూ చెమట పట్టిన శరీరంతో, "డాక్టరు శేఖరంబాబు గారి యిల్లెక్కడ?" అని దారిని కనిపించిన వారిని అడుగుతూ నిద్రపోని దీపాలున్న ఆ యింటి ముందుకి, ఇగిరిపోని మందువాసనల మధ్యకి వచ్చి పిలిచింది ఆయాసపడుతూ చుక్కమ్మ.

రెండో పిలుపుకే వీధివరండాలో విద్యుద్దీపం వెలిగింది వీధి తలుపులు తెరచుకున్నాయి.

"ఎవరమ్మా నీవు! ఏంకావాలి? బాబుకేమయింది?" అంటూ ప్రశ్నించాడు డాక్టరు వీధి వరండాలోకి అడుగు పెడుతూ.

ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియని చుక్క "పాప!" అంటూ దగ్గరే ఉన్న బల్లమీద పడుకోబెట్టింది, ఆరునెలల పసికందును

ప్రక్క ఎగరేస్తూ ఆయాసపడుతున్న పాపను చూశాడు డాక్టరు.

"ఎప్పటినుండి యిలా?" అడిగాడు.

"మూడు రోజులనుండి దగ్గు, జ్వరము, ఆయాసము రెండుగంటలయి ఊపిరి తిరగని ఆయాసంతో బాధపడుతోంది బాబూ. ఇది తండ్రిలేని పిల్ల. నేను దిక్కులేని దాన్ని. నాకున్నది ఈ పాప మాత్రమే డాక్టరు బాబూ. ఇదిలేక పోతే నే బ్రతకలేను. నేను బీదదాన్ని. ఈ పాప, మీపాపే అనుకుని బ్రతికించండి డాక్టరుబాబూ. ఎప్పటికైనా మీ ఋణం తీర్చుకుంటాను...ఎలాగైనా... పాపను..." డాక్టరు సైగ చేయటంతో ఆగిపోయి ప్రక్కకు తిరిగి కన్నీటిని తుడుచుకోసాగిందామె.

డాక్టరు పాపను నెమ్మదిగా తన చేతుల్లోకి తీసుకుని, లోపలి గదిలోకి నడిచాడు పొడవైన టేబుల్ మీద పడుకోబెట్టి రెండు క్షణాలు పాపను నిశితంగా పరిక్షించి, "కంగారేంలేదమ్మా! నేనొక ఇంజక్షన్ యిస్తాను. ఒక మందు కూడా కాగితం మీద వ్రాసి యిస్తాను. దాన్ని బజారులో మందుల షాపులో కొనవలసి ఉంటుంది. నా దగ్గర ఆ మందులేదు. ఆ మందు రెండు మూడు మోతాదులు వాడితే పాపకు నయం అవుతుంది. కంగారేం లేదు" అంటూ మెడిసన్ చెస్టువైపు నడిచాడు డాక్టరు.

కృతజ్ఞతలు నిండిన చూపులతో డాక్టరు చేస్తున్నవి గమనిస్తూ ఉండిపోయింది చుక్క.

డాక్టరు పాపకు యింజక్షన్ యిచ్చి "పాపకు మరేం భయంలేదమ్మా, మందు వ్రాసి యిస్తాను. పాపకు నయం అవుతుంది" అన్నాడు.

చుక్క చేతులెత్తి నమస్కరించింది. అంతలో ఫోన్ రింగైంది. డాక్టరు ఓంగారుగా ఎవరితోనో మాటాడి రిసీవర్ని క్రేడిల్ పైనుంచేసి చుక్కవైపు తిరిగి

"నేను ఒక కేసు చూడటానికి వెళ్ళాలమ్మా! నేను తిరిగి రావటానికి ఎలాగైనా ఒకగంట పడుతుంది. ఈలోపుగా మందు కొనుక్కొని రాగలవా? మా

కాంపౌండర్ కూడ అక్కడే ఉన్నాడు. నేను హాస్పిటల్ తాళం వేసుకుని వెళ్తాను. ఈ ప్రక్కగదులో పేషంట్లున్నారు. నాకన్నా ముందు వచ్చేస్తే అక్కడ కూర్చోమ్మా. త్వరలోనే వచ్చేస్తాను పాపకేం భయంలేదు'' అన్నాడు డాక్టరు బయటికి వెళ్ళటానికి ఉద్యుక్తమవుతూ.

"అలాగే బాబూ" !'' అంది చుక్క వినమ్రతతో.

కొనవలసిన మందు కాగితం మీద వ్రాసి యిచ్చాడు డాక్టరు.

ఆ కాగితం మక్క నందుకుంటూ "ఈ మందు ఖరీదు ఎంత ఉంటుంది బాబూ !'' అని అడిగింది చుక్క.

'నీ దగ్గర డబ్బు ఏమైనా ఉందామ్మ''

"లేదు బాబూ ! కంగారుగా పాపను తీసికుని వచ్చేశాను'' అంది చుక్క.

"నేనిస్తాలేమ్మా ! తరువాత ఇవ్వవచ్చు'' అంటూ పర్సు తీసి డబ్బు ఆమె చేతికి అందిస్తూ, "కొత్త సినీమాహాలు ప్రక్కన ఒక మందుల షాపుంది. అది రాత్రి కూడ తెరచి ఉంటుంది. ఈ మందు కొని ఒక చెమ్చా మందు పట్టమ్మా ! సీసా మూత షాపులో ఎవర్ని తెరచి యిమ్మన్నా తీసి యిస్తారు. పాపకు ఆయాసం తగ్గుతుంది. నిద్రపోతుంది. నేను త్వరలో వచ్చేస్తాను'' అంటూ మెడిసిన్ చెస్టు సర్దుకోవటం ప్రారంభించాడు.

డాక్టరు రిక్షాలో మలుపు తిరగగానే పాపను భుజాన్ని వేసికుని క్రొత్త సినీమా హాలు వైపు బయలుదేరింది చుక్క.

* * *

"ఈ మందు ఉందా బాబూ !'' దడ దడ కొట్టుకునే గుండెను బిగపట్టుకుని, అడిగింది చుక్క.

నిద్ర లేమి చేతనో, బీరుతో కలిపి తాగిన పానీయపు పాలు అధికమవటంచేతనో, అనుభవిస్తున్న స్వర్గ సౌఖ్యాల మధ్యనుండి లేచి వచ్చిన కారణంచేత కలిగిన అసంతృప్తి చేతనో ఎఱ్ఱబడిన కళ్ళతో చుక్క అందించిన కాగితాన్ని అందుకుని కళ్ళనొకసారి చికిలించి చూచి, వచ్చే ఆవలింతను బలవంతంగా ఆపుకుంటూ, "ఉంది''అన్నాడు, కరిగిపోతున్న కలల మధ్య నుండి కళ్ళు తెరవటం యిష్టం లేని వాడిలా !

ఆ మాటనే వరప్రసాదంగా భావించిన చుక్క "ఇయ్యండి బాబూ !'' అంటూ కుడి చేతి గుప్పిటిని విడిచి పెట్టి అంతవరకు చేతిలో నలుగుతున్న రూపాయి నోట్లను ముందున్న బల్లపై ఉంచింది. చెమటతో తడిసిన ఆ రూపాయి నోట్లను కుష్ఠురోగిని చూచినట్లు చూసి, కుళ్ళిన మాంసానికి ఎగురుతూ వాలే రాబందులా చేతిని త్రిప్పి అందుకుని, పదిలంగ లెక్కపెట్టాడు.

"ఇంకా రెండు రూపాయల ఎనభై పైసలు వస్తాయి'' అన్నాడు.

చుక్క గుండె గతుక్కుమంది.

"నా దగ్గర మరేమీ లేదు బాబూ !''— చుక్క గొంతు వణికింది.

"ఇక్కడ మాత్రం మందులు దానం చెయ్యరు.''

"దానం చెయ్యొద్దు బాబూ ! మాది ఈ ప్రక్కూరే. ఈ రాత్రికి ఈ మందు అవసరం బాబూ ! ఈ పాప చావుబతుకుల్లో ఉంది. రేపుదయమే మీ డబ్బు మీ చేతుల్లో పోస్తాను. ఈ పసిదానిముఖం చూడండి బాబూ !'' ప్రాధేయపడుతూ అంది చుక్క.

"ఈ కబుర్లు మా కలవాటే. డబ్బు ఉంటే ఇచ్చి మందు తీసికెళ్ళు. లేకపోతే లేదు. నా కవతల చాల పని ఉంది'' తలుపులు మూసివేయ బోయాడు.

"అలా అనవద్దు బాబూ ! నామీద కనికరం వద్దు. ఈపాపను చూడండి. మందు......''

"పాపనే బ్రతికించుకోవాలని నీకుంటే ఇలా ప్రాధేయ పడవు. నీదగ్గరేమున్నా కుదవ పెట్టి మందు పట్టుకెడతావు. ఈ మనుషుల సంగతి...''

"అలా అనవద్దు బాబూ ! నాదగ్గర ఈ ముక్కు పుడక తప్ప మరేదీ లేదుబాబూ!''

"అదే ఇత్తడిదో !''

"కాదు బాబూ ! కాదు. బంగారందే. నా ఏనిమిదవఏట, మానాయనమ్మ వీరాచారి చేత ముక్కు కుట్టించి, ఈముక్కు పుడక పెట్టించింది బాబూ !''

"చాలు ! చాలు !! ఈ పురాణాలు వినటానికి నాకు టయిము లేదు. ఇష్టముంటే దానినే నాదగ్గరుంచి మందు పట్టుకెళ్ళు''

"అంతేనాబాబూ !''

"ఏం ? మమ్మల్ని నమ్మని మిమ్మల్ని మేము నమ్మాలా?''

"వద్దుబాబూ! నమ్మద్దు'' అంటూ పాపను బల్లమీద పడుకోపెట్టి ముక్కుపుడకనుతీసి అతని చేతి కందిస్తూ "తీసికో బాబూ ! తీసికో. అంతా పోయిన తరువాత ఇది ఉండి మాత్రం నన్ను ఉద్ధరించిందేముంది ? తీసికో బాబూ తీసికో'' అంది చుక్క కళ్ళలో తిరిగే నీటిని నిగ్రహించుకో ప్రయత్నిస్తూ.

'నీమాటలతో నాకు లెఖ్ఖేమిటి ?'





## పెట్రోలు చెట్టు



సౌర శక్తిని హైడ్రోకార్బన్ ఇంధనాలుగా మార్చే పద్ధతులను గురించి అమెరికాలో జరుగుతున్నది. ఈ ఇంధనాల రసాయనిక లక్షణాలు క్రూడ్ ఆయిల్‌లాగానే ఉంటాయని బెర్కిలీలోని కాలిఫోర్నియా యూనివర్సిటీకి చెందిన డాక్టర్ మెల్విన్ కెల్విన్ అన్నారు. రసాయనిక శాస్త్రంలో నోబెల్ బహుమతి గ్రహీత అయిన డాక్టర్ కెల్విన్ రబ్బర్ చెట్టు వంటి ఒక మొక్కను కనిపెట్టారు. ఈ మొక్క నుంచి లభించే పదార్థంతో [illegible] పెట్రోలు వంటి ఇంధనం తయారు చేయవచ్చు. పెట్రోలు చెట్లను పెంపకంలో ఆయన కృతకృత్యులైనట్లయితే ఇంధన రంగంలో ఒక మహా విప్లవమే వస్తుంది. అంటే ప్రపంచం పది కోట్ల సంవత్సరాలు ముందుకి నడుస్తుందన్నమాట. అది నిజమైతే పొలాలలో పెట్రోలు చెట్లు పెంచి వాటి నుంచి పెట్రోలు తీసుకొంటూ ఉండవచ్చు. పనికిరాని చెట్లను పడగొట్టి మళ్ళీ కొత్త మొక్కలు నాటుకోవచ్చు.

# ఒక పిచ్చిదాని కధ

అప్పటికి ఆమెవైపు చూచి డబ్బులతోపాటు ముక్కపుడకనందుకుని క్యాష్ బాక్స్‌లో వేసికుని మందుకోసం బీరువాలు వెతక సాగాడు.

ప్రక్కనున్న సినిమాహాలు లోంచి మాటలు పాటలు స్పష్టంగా వినిపించసాగాయి.

"దైవమా! పయ్యెదలో నడంగి... ..." అని రాగయుక్తంగాసాగే ఆపద్యాన్ని చుక్క వినలేదు. మందుసీసా కోసం బీరువాలు గాలిస్తున్న అతను మాత్రం విన్నాడు. చుక్క వింటున్నదేమోనని ఆమె వైపు చూశాడు. ఆమె ఎగసపడే పాపరొమ్ము వైపే చూస్తున్నది. ఆమె వినలేదన్న ధైర్యం కలిగిందతనికి. ధైర్యంగా రెండో బీరువాను వెతకటం ప్రారంభించాడు.

"లేదాబాబూ!" వణికే గొంతుకతో అడిగింది చుక్క. "ఇచ్చేస్తాలేవమ్మా నీకెందుకు కంగారు?" అని విసుక్కుంటూ తన పనిలో నిమగ్నుడయ్యాడు.

ఆశతో అతని చర్యలనే గమనిస్తున్నాది చుక్క.

"ఇదిగో" అంటూ బల మీద నుండి దిగి దుమ్ముదులుపుతూ మందు సీసాగల అట్టపెట్టె ఆమె ముందుంచాడు.

"పిల్ల సుఖంగా ఉండాలిబాబూ! మందు దొరకదేమో అని అనుకున్నాను" అంది ఆనందంగా.

అతడామె మాటలను వినిపించుకోదలచుకోలేదు

"రెండురోజుల్లో డబ్బులిచ్చి నీవస్తువు పట్టుకెళ్ళు. నీవెళ్ళు నే తలుపులేసుకోవాలి"

"వెళ్తాను బాబు. కాని ఒక్క సహాయం చేసిపెట్టుబాబూ.... ... అలాకోప పడకు బాబూ...... ఈ సీసామూత తీసి పెట్టవు"

ఇబ్బందిగా ముఖం పెట్టి, తప్పదని తెలిసికుని, ఆమె చేతినుండి సీసానందుకుని మూతతీసి, నురల మూతను త్రిప్పి సీసాను ఆమె చేతికందిస్తూ "ఇకనే తలుపులు వేసికోవచ్చా!" అని అడిగాడు.

"ఒక్క క్షణం బాబూ! ఒక గుక్కెడు మందు ఈ చెమ్చాతో పాపకు పట్టిస్తా బాబూ."

"అవన్నీ మీ యింటి దగ్గర. ఇక్కడ కాదు. వెళ్ళు, వెళ్ళు."

"పోనీలే బాబూ. అలాగే వెళ్తాను" అంటూ పాపను ఎడమ భుజాన్న వేసికుని కుడిచేతితో మందు సీసాను పట్టుకుని ముందుకు కదిలింది చుక్క.

* * *

రిక్షా దిగుతూ వరండాలో నున్న బల్లమీద కూర్చున్న ఆకారాన్ని గుర్తుపడుతూ "మందు దొరికిందా మ్మా" అంటూ ప్రశ్నించాడు డాకరు.

"దొరికింది బాబూ" లేచినిలబడుతూ సమాధానం చెప్పింది చుక్క.

కాంపౌండరు హాస్పిటల్ తలుపులు తెరుస్తూంటే "పాపకు మందు పట్టావామ్మా!" అడిగాడు డాక్టరు.

"ఒక చెమ్చా మందు త్రాగించాను బాబూ!"

"లోపలికి తీసుకురామ్మా! పాప కెలా ఉందిప్పుడు?"

"మందు త్రాగిన తరువాత కొద్దిగ ఆయాస పడింది బాబూ! ఇప్పుడు బాగనే నిద్రపోతోంది" అంటూ పాపను గది లోపలికి తీసికొచ్చి బల్లమీద పడుకో పెట్టింది చుక్క.

డాక్టరు ముఖం మీద చెమట తుడుచుకుంటూ వాష్‌బేసిన్ దగ్గరికెళ్ళి "ఇంకో ఇంజక్షన్ యిస్తానమ్మా! ఇకపాపకే భయం ఉండదు" అని చేతులు తుడుచుకుని "ఏదమ్మా పాప!" అంటూ బల్ల దగ్గరికి నడిచాడు. పాప ముఖాన్ని చూసి చటుక్కున తల ఎత్తి

"నే చెప్పిన మందే కొన్నావామ్మా" అని అడిగాడు.

"అవును బాబూ! మీరు చెప్పిన మందే బాబూ! ఇదిగో" అంటూ మందు సీసా నందించింది చుక్క.

ఆత్రంగా మందు సీసానందుకుని అటు ఇటు త్రిప్పి చూచి "నే చెప్పిన మందే నమ్మా ఇది. క్రిందటి సంవత్సరం ఫిబ్రవరి వరకే దీనిని వాడాలమ్మా! అటు తరువాత దీనిని వాడకూడదు."

"అయితే ఎలాబాబూ! ప్రమాదంలేదు కదా!"

"ప్రమాదమేనమ్మా" అంటూ పాపను చేతితో తట్టి చూచి "ప్రమాదమేనమ్మా" అన్నాడు జీరపోయిన గొంతుకతో.

"అలా జరగకూడదు బాబూ! ప్రమాదం తప్పించండిబాబూ! చచ్చి మీ కడుపున పుడతాను బాబూ..."

"లాభంలేదమ్మా! పాప చచ్చిపోయి అరగంట అయిపోయిందమ్మా!"

"బాబూ!... నా పాప బాబూ!... నాపాప...పాపా!..." అంటూ పాపమీద ఒరిగి పోతూ గొల్లుమంది చుక్క.

నెత్తురు చుక్కను రాల్చకుండ హత్య చేసిన కత్తిలా నవ్వ సాగింది మందుసీసా.

డాక్టరు బాధతో ముఖం త్రిప్పుకున్నాడు

బరువెక్కిన మేఘాలు భోరున వర్షించ సాగాయి.

# షాలాకు ని డైరీ

## 42 కోట్ల మందికి 67 పైసల ఆదాయం!

మన భారతదేశంలోని సుమారు అరవైకోట్ల జనాభాలో యీనాటు రోజున అరవైయ్యేడు పైసల ఆదాయం కూడా లేనివారు సుమారు నలభైరెండు కోట్లమంది వున్నారట. అనగా సుమారు నెలకు ఇరవైరూపాయల పది పైసలు ఆదాయం మించక, ఆ ఆదాయం చాలక నానా అవస్థ పడేవారే దేశపుగడ్డమీద నలభైరెండుకోట్ల మంది వున్నారట. వుండరూ మరి! మంది ఎక్కువైతే మజ్జిగ పల్చబడిందన్న ఆర్యోక్తి వ్యర్థమవుతుందా!

## లంచాల్లో అగ్రస్థానం

భారతదేశంలో అధిక "లంచలావణ్యం" కల రాష్ట్రం బీహార్ అట! లంచాల రేట్లు నిర్ణయించడంలోనూ, వసూలు చేయడంలోనూ ఆ రాష్ట్రంలో అధికారులే రాష్ట్ర ప్రజలకు, చిన్న చిన్న ప్రభుత్వోద్యోగులకు మార్గదర్శకులయ్యారట. అసలీ "లంచలావణ్యం" కే. బి. సహాయ్ ముఖ్యమంత్రిగా వున్నరోజుల్లో ఓవయ్యారాన్ని సంపాదించుకుందట. ఒక ఎక్సయిజు అధికారిని బదిలీ చేసే విషయంలో వోయుంయుత్యేగారు ముఖ్యమంత్రి శరణుకోరారట. దానికాయన నవ్వి "ఎంతలాగావెట్టి" అన్నారట. "ఎనిమిది వేలు" అన్నార్ట యమ్మెల్యే వినమ్రులై. దానికా ముఖ్యమంత్రిగారు ముక్కున వేలేసుకుని, "దీనికి ఎనిమిది వేలేనా! పదిహేన వేలు అడుగు బేరన్స్ వసూల్ హై" అన్నారట. ఆయన నాటి నీరు పోసిన అవినీతి వృక్షం ఏపుగా ఎదిగిందటీనాడు. ఈ రకం బదిలీలకు ఇరవైఅయిదునుంచి యాభైవరకూ పలుకుతోందటక్కడిప్పుడు. "లోకా సమస్తా సుఖినోభవస్తు"

### పోలీసు సమ్మెలో నేరాలు పూజ్యం

మొన్నామధ్యన ఫిన్లండులోని పోలీసు ఒక నెల సమ్మె చేశారట. తమాషా ఏమిటంటే ఆ నెలకాలంలో, ఒక్క దొంగతనంగానీ, దోపిడీగానీ, దౌర్జన్యంగానీ అక్కడ జరగలేదట. షుష్... అలా అనుకోరాదు.

### ప్రధాని సంభాషణలు రాసిన చిత్రం!

భారత ప్రధాని మొరార్జీదేశాయ్ ఒక హిందీ సినిమాకి కథా, మాటలు రాశారట. ఆ సినిమా భారతీయ సంస్కృతిని చూపేదని. అందుకే తాను ఒప్పుకున్నాననీ, ఎన్నిపనులున్నా రోజూ కొంత రాసి పూర్తిచేశాననీ ఆయన అండర్ ... అన్నారట. ఏం! మన ... దేంలేదు

### నల్లబజారులో పోలీసులు!

బెంగుళూరులో మెజస్టిక్ సర్కిలు ప్రాంతంలో వున్న ఓ థియేటరు ముందు ఇద్దరు పోలీసులు సినిమా టిక్కెట్లు బ్లాక్ మార్కెట్టులో విక్రయించివిరాళిమన్యులలా చెక్కుపోతూంటే దారిన పోయే ఓ పోలీసు అధికారి ఆశ్చర్యపోయి, చేరుకుని వారిని అటకాయించేసరికి వారిద్దరూ చేరి ఆయన మీద చేయిచేసుకుని పారిపోబోతే చూపరులు పట్టుకున్నారట. బాగుంది వరస. జనం తప్పుచేస్తే పోలీసుపట్టుకుంటుంది అదేపోలీసు తప్పు చేస్తే ప్రజే కదా పట్టుకోవాలి. పోలీసూ ప్రజే కదా!

### రాని బాకీలు!

పోయిన ఏడు టెలిఫోనుశాఖ వసూలు చేయలేకపోయిన బాకీలు సూటపదకొండు లక్షల రూపాయలని లెక్కలు తేల్చి చెప్పిందట. బాపురే... యింత డబ్బు బాకీవసూలు కాలేదా? కారణమేమని అడుగులే అయా బోసులెక్కడెక్కడున్నారో విలాసాలు ఓసుక్కో లేక పోయినని కొన్ని, కొన్ని ఆ సంబంధమైన ఫైళ్ళు కనబడకపోవడం కారణమని ఆ శాఖ అన్నదట.

(50 వ పేజీ చూడండి)





**మా**మిడి పళ్ళ సీజన్లాగే పెళ్ళిళ్ళ సీజన్ కూడా వచ్చేసింది

తల్లీ, కొడుకూ ఇద్దరు మాత్రమే ఉన్న కుటుంబాన్ని ఈడ్వటానికే ప్రభాకరం ఆప సోపాలు పడుతున్నాడు. ఇలాటి సీజన్లు తాకిడి తగిలితే వాడి వదలి పోవాల్సిందే. కాకపోతే వంద ముప్పయ్ రూపాయలిచ్చి మామిడి కాయలు కొని ఆవకాయి పెట్టించి అక్క చెల్లెళ్ళకి పంపించడమే చేస్తాడా? పిలిచిన ప్రతి పెళ్ళికీ వెళ్ళి రెండున్నర రూపాయల భోజనం చేసి పది రూపాయల ప్రెజంటేషన్ కొని చదివించుకుంటాడా?

"ఒరేయ్! చుట్టపక్కాలన్న తర్వాత పెళ్ళిళ్ళకి, పేరంటాలకీ పిలవర్రటా సంబంధాలుంచుకోటానికి పిలిచిం తర్వాత వెళ్ళరేమిట్రా వెళ్ళాల్సివచ్చినప్పుడు చదివింపులు చదివించుకోర్రా? భోజనం ఖరీదుకీ చదివింపు ఖరీదుకీ లెక్కలు గట్టి కంటుసబడిపోతే ఎలారా?" అని తల్లి అంటూనే వుంటుంది

"బావుందమ్మా వాళ్ళు పిలుస్తున్నారన్చెప్పి చదివింపులు చదివించుకుంటూపోతే బ్రతికినట్టే అయినా కాపోయినా ఇటునుండి అటే కాని అటునుండిటు వచ్చే అవకాశం ఏమైనా ఉందా ఏమన్నానా?" అని ప్రభాకరం అంటూనే వుంటాడు.

సంభాషణ అంత వరకూ వచ్చే సరికి బ్రేకులు పడిన బండిలా మరి కదలదు తల్లి బాధ పడుతుంది అది చూసి తను బాధ పడతాడు అంతే ఏ పెళ్ళి విషయంలో ఆ స్తంభన వచ్చిందో ఆ పెళ్ళికి వెళ్ళనూ వెళ్తాడు ఏదో ఇవ్వనూ ఇస్తాడు

కొడుక్కి ముప్పయ్యేళ్ళు దాటే వయసొచ్చింది అక్క చెల్లెళ్ళందరికీ ఏదో తగిన బొంతల్ని తెచ్చి పెళ్ళిళ్ళు చేసేడు తను చేసుకోమంటే చేసుకోడు కారణం ఏమిటో తల బద్దలు కొట్టుకున్నా అర్థం కాదు ప్రభాకరంవాళ్ళమ్మకి పోనీ అడిగితే తిన్నగా జవాబు చెప్తాడా? చెప్పిందే తక్కువ అదీ తిరకాసుగానే చెప్తాడు అంచేతనే అయిన వాళ్ళకీ, కాని వాళ్ళకీ, ఇరుగు వాళ్ళకీ, పొరుగు వాళ్ళకీ ప్రభాకరాన్ని పెళ్ళికొప్పించమని చెప్తూంటుంది

ఇక ప్రభాకరం సంగతా? పాతికేళ్ళ వయసప్పుడు చూసిన ప్రతి అమ్మాయీ అందంగా వున్నట్టే కనిపించేది పరిచయమైన ప్రతి అమ్మాయీ చూసిన చూపూ ములుకులా గుండెల్లో గుచ్చుకునేది. మాటాడిన ప్రతిమాటా కలవరపెట్టి గిలిగింతలయేది కానిఅంతటితోసరి తెలివొచ్చేది తన కుటుంబ పరిస్థితి జ్ఞాపకం తెచ్చుకునేవాడు. ఆ అమ్మాయి తాహతు చూసేవాడు. గుడ్‌బై

కుటుంబ పరిస్థితుల వల్లనే పెళ్ళి చేసుకోవడాని కిష్టపడటం లేదన్నది ప్రభాకరాని కొక్కడికే తెలిసిన విషయం. అతను బియ్యేడీ చదువుతుండగా వాళ్ళ నాన్నగారు పోయేరు మిగిలిన ఆర్నెల్లూ వాళ్ళ మేనమావ దయవల్ల గట్టెక్కాడు ఉద్యోగం రాగానే తన సంసారం ప్రారంభించేడు వాళ్ళ నాన్న ధర్మమా అని అప్పులేం అంటుకోలేదు. అక్కచెల్లెళ్ళ పెళ్ళిళ్ళు జరిపించేడు చిన్నప్పటినుండీ కాకపోయిన పాతికేళ్ళ వయసులో తలకెత్తుకున్న బాధ్యత పదేళ్ళుగా నడపడంతో ప్రభాకరానికో జబ్బు అంటుకుంది— ఈ పెరుగుతున్న ధరలూ, పెరగని బడిపంతులు జీతమూ ఈ రెండింటి మధ్యా తల్లీ కొడుకూ నలిగిపోతుంటేమూడో మనిషిని పగ్గంవేసి లాక్కురావడం మంచిది కాదు

"అడుక్కున్నవాళ్ళు బతకటం లేదా? కూలివాళ్ళు బతకటంలేదా? అంతెందుకు ఒకే స్కూల్లో పనిచేస్తున్న తనతోటి ఉపాధ్యాయులూ, వాళ్ళ పిల్లాపాపలతో సహా బ్రతకటంలేదా" అని అంతా చెప్పి చూసేరు ఊహూ! అక్కడికి మేనమావ తాతాజీ ఒక్కడే మిగిలి పోయేడు చెప్పడానికి

# నూరేళ్ల పంట

ప్రభాకరం తల్లికి తాతాజీ స్వయంగా పినతల్లి కొడుకు. దూరానున్నాడు. ఎక్కడో దగ్గిరవాళ్ళ చావులకీ, ఎప్పుడో పెళ్ళిళ్ళకీ మాత్రమే వస్తుంటాడు. ఆ రావడంకూడా కోటాపద్ధతిమీద ఒకసారి అతను వస్తే మరోసారి అతని భార్య మాత్రమే వచ్చేది. అంచేత వాళ్ళ కుటుంబం గురించి ప్రభాకరానికి తెలిసింది తక్కువ.

ఇన్నాళ్ళకి ఆయన కూతురి పెళ్ళి తలపెట్టారు. చూపులూ, తంతులూ అయిపోయేయి. నిశ్చయం కూడా జరిగినట్టే ఒక్కసారి అనుకుంటే. "అంటే తను నిశ్చయానికి వచ్చి పెళ్ళికూడా దగ్గర్లోనే జరిపించేస్తాం కాబట్టి అక్కచెల్లెలివయి సందున నువ్వు దగ్గరుండడం బాగుంటుంది. తప్పకుండా రమ్మ''ని రాసేడాయన. ప్రభాకరానికి తాతాజీ చేతకూడా బ్రెయిన్ వాష్ చేయించడానికి మంచి సమయం.

"ఈ వయసులో ఈ ప్రయాణాలూ అవీచేసి, పెళ్ళిళ్ళలో నలిగిపోయి హైరానా పడలేనా)...నువ్వేవెళ్ళి పెళ్ళయ్యేదాకా వుండి వొచ్చేరా...'' అంది వాళ్ళమ్మ.

రైలు ఛార్జి ఇటునుండిరవై, అటు నుండిరవై, ప్రయాణపు ఖర్చులు మరో పదీ...చదివింపులూ.. ఉన్ననాలుగురోజులూ ఇతర ఖర్చులూ...కనీసం నూటయాభై అయినా వుండాలి తను వెళ్తే. తల్లిని పంపిస్తే అంతగా అయితే రైలుఛార్జీలూ, చదివింపుకూ మాత్రం ఖర్చవుతుంది. అదే ప్రభాకరం వాళ్ళమ్మతో చెప్పేడు.

"దగ్గిందానికీ తుమ్మిందానికీ జమా ఖర్చులేస్తే నిలార్రా, అయిందవుతుంది. మన కిప్పుడు అప్పులంటూ ఏవున్నాయి. వచ్చిందానికి దర్జాగా బతకొచ్చు కదా. నవ్వన్ని లెక్కలేస్తే సరే...నేనే వెళ్తాను... నాతిండి ఖర్చయినా తగ్గుతుంది'' అంటూ బాణం వేసేసరికి తిరుగుజవాబు చెప్పకుండా ప్రభాకరమే బయల్దేరేడు.

ప్రభాకరం వెళ్ళిన రోజు సాయంత్రమే పెళ్ళివారు నిశ్చయాలకి రాబోతున్నట్టు తెలుసుకున్నాడు. అంతేకాదు, తానురావటం చాలా ఆలస్యం చేసినట్టు కూడా తెలుసుకున్నాడు. ఎంచేతనంటే మేనమామ కూతురు నిర్మలని చూసింతర్వాత చాలా కాలానికి ప్రభాకరం మనసు పెళ్ళి మీదికి పోయింది. అయితే తన జీతంలో సంసారం ఈడ్చటంలో అతనుందనుకుంటున్న కష్టమూ, ఆ పిల్లకి పెళ్ళి నిశ్చయం కాబోతున్నదన్న నిజమూ—రెండు కారణాలవల్లా మనసును ఉగబట్టుకోవాల్సివచ్చింది.

పెళ్ళివారు వచ్చేరు. పెళ్ళినిశ్చయాలకి తను వెళ్ళడం ప్రభాకరానికి అదే మొదటిసారి. పెళ్ళి ఎక్కడ జరపాలో, రాకపోకల ఖర్చులూ, చివరికి రిక్షాఖర్చులూ, పెళ్ళి బొండాం, అరటిపళ్ళూ ఎన్నెన్ని ఉండాలో ఇంకా అంతకంటే చాలా చిన్నవిషయాల కూడా అంతనికృష్టంగా వ్యాపార సరళిలో







విలా మాట్లాడుకుంటారో విన్నాడు ప్రభాకరం. మరి వినలేకపోయేడు. చివరగా కాళ్ళు కడిగి కన్యాదానం చేసేటప్పుడేదో లాంఛనం సూచించేరు మగపెళ్ళివారు.

అక్కడొచ్చింది పేచీ. మాలో ఆ సాంప్రదాయం లేదన్నారు తాతాజీ. మాలో దానికి చాలా పట్టింపుందన్నాడు వియ్యంకుడు. లేని దెలా తెచ్చేదంటాడు తాతాజీ. ఉన్నదెలా మానీసుకుంటమన్నాడు వియ్యంకుడు. మా ఇంట్లో పెళ్ళి జరిపిస్తున్నాం కాబట్టి మా ఇంటి సంప్రదాయం ప్రకారం చెయ్యాలంటాడు తాతాజీ కోడలొచ్చేది మా ఇంటికి కాబట్టి మా ఇంటి సంప్రదాయం ప్రకారం నడుచుకోవడం ధర్మం అంటాడు వియ్యంకుడు.

మధ్యవర్తులు అసహాయంగా వుండిపోయేరు. ప్రభాకరం అసహ్యంతో నిండిపోయేడు.

ఇంటింటా ఇదే తీరున జరుగుతుంటాయని అప్పుడే తెలిసిందతనికి. కొత్తగా పెళ్ళయ్యేవాళ్ళ నూరేళ్ళ బ్రతుకును ఈ పెద్దాళ్ళు సంప్రదాయాల పేరిట ఆలోచించడం మానుకోని ఎన్ని యుగాలయ్యిందో అన్పించింది. పేచీ తేలక పోవడంతో పెళ్ళి తేలిపోయింది.

"అమ్మని పంపినా బాగుండి పోయేది. నే నొచ్చి ఇలా జరిగిం దేవిటి చేసేదిరా బాబూ" అనుకున్నాడు ప్రభాకరం. రెండు రోజులపాటు మేనమావ ముఖం చూడలేక ఊరు చూడాలన్న మిషతో ఊళ్ళో తిరిగేసేడు. మూడో రోజున "మరి నే వెళ్ళొస్తాను మామయ్యా" అన్నాడు ప్రభాకరం.

తాతాజీ మామూలా వున్నా, జరిగిన సంఘటనకి నిర్మల మాత్రం నిమ్మకునీరెత్తినట్టు నిబ్బరంగా వుంది. ఆ రెండు రోజులూ ప్రభాకరం ఏ సమయంలో భోజనానికి వచ్చినా సిద్ధంగా వుండేది నిర్మల. ఇప్పుడు సమాధానం కూడా నిర్మల నుండి సిద్ధంగానే వున్నట్టు తోచింది. తోచడం కాదు వచ్చింది కూడా.

"ఎక్కడికి వెళిపోతావు బావా. రాకరాక వచ్చేవు. పదిహేను రోజులైనా ఉండకపోతే నామీద ఒట్టే..." అంది నిర్మల. అదేసి అది నిశ్చయం అయినట్టుగా లోనికి వెళ్ళిపోయింది.

"అవును బాబూ...దానికి నువ్వుండడం సంతోషం కలిగించేట్టయితే నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. ఉండు బాబూ..." అన్నాడు తాతాజీ.

తర్వాత ఓ పది రోజులు సినిమాలూ, షికార్లూ, బీచ్‌లూ, పిక్‌నిక్‌లూ... నిర్మల పట్టుపట్టడం ... ఒట్లూ ... ప్రభాకరం ఒప్పుకోవడం...

ఓ రోజు మాటలసందర్భంలో అడిగింది నిర్మల. "బావా...నువ్వు ఇంతకాలం పెళ్ళెందుకు చేసుకోలేదు."

"నచ్చిన అమ్మాయి దొరకలేదు" అంటూ నిర్మల కళ్ళలోనికి చిలిపిగా చూస్తూ అందామనుకున్నాడు ప్రభాకరం. ఇది సినిమా కాదు కథకాదు. జీవితం అన్నవిషయం తెలిసిన వాడవడం చేత.. "ఏంలేదు నిర్మలా..." అంటూ ఆగిపోయేడు.

"ఈ పదిరోజుల సాన్నిహిత్యంలో ఇంకా నా దగ్గర చెప్పకూడదు అనుకుంటున్నవి ఉన్నాయేవిటిబావా ?" అంది నిర్మల కాస్త నిష్ఠూరంగా.

"అబ్బే...అది కాదు కాని..." తన పరిస్థితి ఆ అమ్మాయి ముందు ఎలా విప్పి ఆరెయ్యడమా అని జంకేడు.

"చెప్పుబావా...చెప్పకపోతే..."

"ఒట్టేగాని...మరేంలేదు నిర్మలా నేను బడిపంతుల్ని మా అమ్మా, నేనూ బతకడానికే నా జీతం సరిపోతున్నట్టు అనిపించడంలేదు మరి పెళ్ళి చేసుకుని నూరేళ్ళ బతుకునీ డబ్బు ఇబ్బందులతో ఎలా నరకప్రాయం చేసుకునేది ? పెళ్ళయ్యాక సరదాలు తీర్చుకోవడానికైనా సరిపోయినంత డబ్బు ఉండాలి కదా. డబ్బే సర్వస్వం అనను. డబ్బు మనిషినయితే డబ్బు సంపాదించడం కష్టమూ కాదు. కాని మా బడి పంతుళ్ళకి ప్రభుత్వం చూపిన సౌకర్యాలు లేవు ఎన్ని సంవత్సరాలు పనిచేసినా వచ్చేది సంవత్సరానికో ఇంక్రిమెంటు తప్ప ఏం లేదు. విడుదుబొదుగు లేని ఆర్థిక చట్రంలో




## లక్ష్మి యెప్పుడు స్థిరంగా ఉంటుంది?

లక్ష్మి అంటే కేవలం సంపద అనే కొందరు అనుకుంటారు. ధనమే కాకుండా ధాన్యం, సంతానం, విజయం మొదలైనవి కూడా లక్ష్మీప్రదవాచ్యాలే అవుతాయి అందువల్లనే అష్టలక్ష్ములు మనకు ప్రసిద్ధంగా కానవస్తారు. గజలక్ష్మి-సంతానలక్ష్మి-విద్యాలక్ష్మి-ధనలక్ష్మి-ఆదిలక్ష్మి-విజయలక్ష్మి-ధాన్యలక్ష్మి-ధైర్యలక్ష్మి- ఆ అష్టలక్ష్ములు.

లక్ష్మి ఒకచోట స్థిరంగా ఉండదు. కొంత కాలమే ఒకచోట ఉంటుంది. అందువల్లనే 'చంచల లక్ష్మి' అనే పేరు వచ్చిందామెకు.

అయినా కొన్ని చోట్ల ఆమె స్థిరంగా ఉంటుందనడానికి ఈ క్రింది కథ చక్కని ఉదాహరణ —

భోజ మహారాజుకు అష్టలక్ష్ముల అనుగ్రహమూ ఉండేది ఆయనకు ఏ లోపమూ లేదు స్వయంగా విద్వాంసుడు. విద్వత్కవులకు లక్షల లక్షలు ఇచ్చి సన్మానించేవాడు. ఆయన నిత్యమూ అష్టలక్ష్ములనూ ప్రతి దినమూ పూజించేవాడు. వారి ముఖాలు కలకలలాడుతూ ఆయనకు అగపడేవి

ఒకనాడు అష్టలక్ష్ములూ ఆయనను పరీక్షించ దలచాయి ఆ దినం రాజు మామూలు ప్రకారం పూజ చేశాడు. హారతి యిచ్చేటప్పుడు చూడగా ఆ లక్ష్ముల ముఖాలు కళావిహీనాలయి కనబడ్డారు. ఆయన నిర్ఘాంతపోయి చూడసాగాడు. ఆ దేవతలు "ఓ రాజా! మేము ఇన్నాళ్ళూ నీ గృహంలో ఉన్నాము. నేటితో నీకూ మాకూ ఉన్న బంధం తెగిపోతుంది. రేపు మేము నిన్ను విడిచి వెళ్ళిపోతున్నాం మేం వెళ్ళిపోయేటప్పుడు ఏదైనా కోరుకో. నీ కోరిక నెరవేరుస్తాం. మా శక్తులు నీకు తెలుసు గదా!" అన్నారు.

మర్నాడు పూజానంతరం ఒక్కొక్క లక్ష్మి లేచి, రాజును వరం అడగవలెనని చెప్పారు ఆయన ఎవర్నీ ఏమీ కోరడం లేదు వెనుకకు లక్ష్ములెల్ల ఆయన ఏమీ కోరలేదు వారు మాయమయి పోయారు.

చివరిది ధైర్యలక్ష్మి. ఆమె వరం కోరవలెనని అడగ్గా భోజ మహారాజు "అమ్మా! ఎవ్వరు లేకపోయినా నాకు విచారం లేదు. నీవు మాత్రం నన్ను విడిచి పోవద్దని కోరుతున్నాను ఇదే నీవు ఇయ్యవలసిన వరం" అని ప్రార్థించాడు. ఆమె చిరునవ్వు నవ్వుతూ 'సరే లే! అలాగే వుంటాను. నిన్ను విడువను లే' అన్నది.

ధైర్యముంటే సమస్తాన్నీ సాధించవచ్చునని ఆయన విశ్వాసం. లక్ష్ములలో ధైర్యలక్ష్మియే చాలా ముఖ్యమైనది.

మర్నాడు రాజు ఒక్క లక్ష్మినే పూజించవలసి వస్తున్నదే! అనే విచారంతో పూజాగృహం ప్రవేశించాడు.

ఆయనకు ఆశ్చర్యం కలిగింది. అందరు లక్ష్ములూ కలకలలాడుతూ ఎంతో శోభలతో యథాస్థానాల్లో ఉన్నారు.

ధైర్యలక్ష్మి ఉన్న చోట తక్కిన లక్ష్ములు ఉండి తీరుతారు.

ఈ కథ వల్ల— ధైర్య మనేది ఒక్కటి ఉంటే సమస్తమునూ సాధించవచ్చునని తెలుస్తున్నది.

---

ఎదురుతూండే సంసార చక్రాన్ని ఎలా బంధించను నిర్మలా...చెప్పు" అన్నాడు ప్రభాకరం.

"ఇదేనాబావా...నువ్వు పెళ్ళి చేసుకోక పోవడానికి కారణం? ముఖ్యమైన విషయమే అయినా చాలా చిన్నవిషయమేబావా. నేనీ విషయాన్ని చిన్న ఉపమానంతో చెప్తాను. దాని మీద నువ్వాలోచించు. సంసారం చిల్లి కుండలాంటిది. గంగాళంతో పొయ్యి, చెంబుతో పొయ్యి, ఎంతనీరు పోసినా నిలవుండేది నిల్వే. అలాగని కుండ పారేసు

## నూరేళ్ళ పంట

కోవడానికి మనసొప్పదు. సంసారం మానేసుకోకూడదు. ఏమంటావు బావా?"

ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉండిపోయేడు ప్రభాకరం.

చిన్నబుచ్చుకుంది నిర్మల. తలదించుకుని "పదేళ్ళపాటు నువ్వు సంసారం చేసేవు నిజమేకాని బావా...అనుభవం సంపాదించలేక పోయేవు. అంచేతనే పెళ్ళి చేసుకోవడానికి భయపడుతున్నావు. బావా... వికల్పాంతరం లేకపోతే చిల్లికుండైనా సరే నీ సంసారంలో పాలుపంచుకునే అవకాశం నాకియ్యి. సంసారపు బేలెన్సుషీటుని టేలీచేసి చూపిస్తాను" అంది నిర్మల.

పకపకా నవ్వేడు ప్రభాకరం. ఆనందంతో మరింతగా నవ్వేడు. "నీ ఉపమానాలూ... నీ ముక్కుసూటితనం చూస్తుంటె నువ్వు సమర్థురాలివే ననిపిస్తున్నది నిర్మలా. అంచేతనే నీతో నూరేళ్ళూ భాగం పంచుకోవాలనుకుంటున్నాను." అన్నాడు నవ్వుతూ.

# ఛాంపియన్ డిటర్జెంట్ కేక్!




శుభ్రతా, సువాసనా, మెరుపూ
సమకూర్చే ఛాంపియన్!

## మురికిపై విజయం!



అధిక శక్తిగల వన్-అప్,
మురికిని నామరూపాలు
లేకుండా తుదముట్టించి,
మురిపించే మెరిపించే
శుభ్రత నిస్తుంది!

వన్-అప్ లోని అధిక శక్తివంతమైన పదార్థాలు, లోపలికి చొచ్చుకుపోగల, తీవ్రంగా పనిచేసే నురగనూ, అధికంగా తెలుపుచేసేవాటినీ సమకూరుస్తాయి. అందుకే వన్-అప్, లోపలదాగిన మురికిని అంతా తీసేసి, బట్టలని శుభ్రపరుస్తుంది—దాంతో తెల్లవాటికి మరింత తెలుపు, రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.

## బట్టలకు సంరక్షణ!



సుతిమెత్తని వన్-అప్ మీ
బట్టలను పూర్తిగా సంరక్షించి,
వాటికి సుగంధాన్నిచ్చే ఓ
తాజాదనాన్ని తెస్తుంది!

వన్-అప్, శక్తివంతమైనదైనా ఎంతో మృదువుగా పని చేస్తుంది ఎందుకంటే దీనిలో హానికరమైన పదార్థాలేమీ లేవు గనక చక్కని సుగంధం చిందించే వన్-అప్, మీ బట్టలపై మృదుత్వంతో పనిచేస్తుంది దాంతో అవి సుగంధం తాజాదనంతో రూపొందుతాయి.

## డబ్బు ఆదాతో ఉపకారం!



వన్-అప్‌లోని మన్నగల
శక్తి, మరీ మరీ, ఉతికిన
ప్రతిసారీ డబ్బును ఆదా
చేస్తూనే ఉంటుంది!

వన్-అప్, మరే ఇతర డిటర్జెంట్ కేక్ కన్నా ఎక్కువ కాలం మన్నుతుంది ఎందుకంటే, వాడగానే దబ్బున అరిపోతుంది గనక అంటే వాడే ప్రతిసారీ మీరు డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!




ASF/WL—I UP IA

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330, గుజరాత్.

# వారఫలం

మహేష్

4-8-1978 శుక్రవారం మొదలు
10-8-1978 గురువారం వరకు

మేషం :— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది అనవసరమైన సందేహాలకు గురి కాగలరు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

వృషభం :— మీ కార్యక్రమాలు అడావుడిగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మిథునం :— వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

కర్కాటకం :— రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

సింహం :— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషిరాణించగలదు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

కన్య :— మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో ప్రయాసకు గురికాగలరు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. పోటీవారిలో గౌరవం బాగుంటుంది.

తుల :— సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో వ్యతిరేకమైన వార్తలను వింటారు. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

వృశ్చికం :— ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసినడబ్బు అందగలదు. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

ధనుస్సు :— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

మకరం :— సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. మీ తాలూకు మనుషులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అనుకూలమైన వార్తలను వింటారు.

కుంభం :— మీ ఆలోచనలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మీనం : మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

## సముద్రమే ఒక పెద్ద బ్యాటరీ

సూర్య రశ్మిలో అధిక భాగాన్ని సేకరిస్తున్నది సముద్రాలే సాగర కెరటాల నుంచి ఇంధనోత్పత్తి చేయవచ్చు. కనుక, సముద్రాన్నే ఒక పెద్ద బ్యాటరీగా ఉపయోగించుకొనవచ్చు. శాస్త్రజ్ఞులు ఈ అంశాలను తీవ్రంగా పరిశీలిస్తున్నారు. సాగర ఉపరితలం నీటిలో, సాగర గర్భ జలాలలో గల లవణ ప్రమాణాల వ్యత్యాసాలు రెండు పెద్ద ఎలెక్ట్రోడ్లుగా పని చేస్తాయి. ఈ రెండింటి మధ్య విద్యుత్ కరెంటు ప్రసారం అవుతూ ఉంటుంది. దీనిని ఆధారంగా చేసుకొని నేరుగా విద్యుచ్ఛక్తి తయారు చేయవచ్చు.

సాగర జలాల ఉష్ణోగ్రతల లోని వ్యత్యాసాలను ''థర్మల్ గ్రేడియెంట్'' అంటారు. దీన్ని గురించి డాక్టర్ మెర్విన్ ఇలా వివరించారు

భూగోళపు ఉత్తర దక్షిణ ధృవాలు అతి శీతలంగా ఉంటాయి. ఈ ప్రాంతాల మంచు నుంచి ప్రవహించే శీతల జలం సముద్రాల అడుగు భాగానికి చేరుకొని, భూమధ్య రేఖ వరకు ప్రవహిస్తుంది. కనుక సాగరాలలో అన్నిచోట్లా — 900 లేక 1000 మీటర్ల లోతులో శీతల జలం ఉంటుంది.

హీట్ ఎక్స్ఛేంజర్లని ఉపయోగించి ఈ థర్మల్ గ్రేడియెంటు సూత్రం పై సాగర జలాల నుంచి విద్యుచ్ఛక్తి తయారు చేయవచ్చునని డాక్టర్ మెర్విన్ చెప్పారు.

మన చుట్టూ ఇంధన వనరు లున్నాయి. ఇవి అపారమైనట్టివి, తరగనివి. సక్రమంగా వీటిని వినియోగించుకొనటం మీద నే ప్రపంచ సంక్షేమం ఆధారపడి ఉన్నది అని అంటారాయన.

# హార్లిక్స్

Horlicks
THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకురుతుంది ఆరోగ్యం మహాభాగ్యం

హార్లిక్స్. ప్రపంచం అంతటా డాక్టర్‌లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు, అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిశ్రితమితాయి దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్** మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

Hx1548-TAL-7



సీరియల్

# మోహనరూప

## మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"ఆ రాణి షూటింగ్‌కే వచ్చిందే అనుకో, జ్వరం రానేల! జ్వరం వచ్చిందే అనుకో, ఈ రూపాదేవినే పిలువనేల! పిలిచిందే అనుకో ఆమె అసిస్టెంటుండగా తను పోనేల! పోయాడే అనుకో, సినిమా తార గదా, కాస్త గంభీరంగా వుండక కోడిపెట్టలా పాత విషయాలన్నీ త్రవ్వనేం!"

"దీనికంతా కారణం విస్సిగాడే వీడిమూలంగా నాకు చావు వచ్చింది" అనుకున్నాడు బియెస్సి మొదటి సంవత్సరం అది కాలేజికి సెలవులివ్వగానే యింటికి వెళ్ళి ఏం చేస్తామని అందరూ సరదాగా తిరుపతి, మద్రాసు వెళ్ళారు విశ్వానికి సినిమాతార రాణి అంటే వల్లమాలిన అభిమానం ఎంత చెత్త సినిమా అయినా సరే ఆమె ఉందంటే చూస్తాడు. మద్రాసు వచ్చి రాణిని చూడకుండా పోవటం అసాధ్యమన్నాడు ఆమె ఇంటిచుట్టూ ఎన్ని ప్రదక్షిణాలు చేసినా, అభిమానులం అని చెప్పి ఏడ్చినా, గూర్ఖా లోపలికి వెళ్ళనియ్యడ. అప్పుడు సుధీర్ ఓ మాస్టర్ ప్లాన్ చెప్పాడు అందరూ హోటల్‌కు వచ్చారు ఇంద్రమోహన్ త్వరగా భాషలు అనుకరిస్తాడని తెలుసు

"ఒరేయ్ ఇంద్రా! అచ్చం అమెరికా యాక్సెంట్! ఫేలయిందో ప్రణాళిక, నిన్నూ, ప్రణాళిక వేసిన సుధీర్‌గాడిని సముద్రంలో విసిరివేస్తాను"

ఇంద్రమోహన్ రాణి ఇంటికి ఫోన్ చేశాడు

"హల్లో .. అయామ్ ఇంద్రమోహన్ .. రిసర్చి స్కాలర్ ఫ్రమ్ యు ఎస్సే యు డోంట్ ... నో కెన్‌యు సే హాయ్ టు స్వీట్ రాణి ఓయ్యా .. అలాగే పిల్సండి హల్లో! ఓ డేమ్! మిమ్మల్ని కంగ్రాచ్యులేట్ చెయ్యకపోతే షేమ్ ఓ కపుల్ ఆఫ్ మూవీస్ చూచాం ఓ డియర్, రీటా, గ్రేస్‌కెల్లి, ఎలిజబెత్ అంతా ట్రాష్ ... భోజనాలకు రావాలంటే కుదురదు మై గయ్స్ ఆర్ దేర్ అందరిని వద్ద విజిట్‌కు వస్తాం . ఓ. కె . థాంక్యూ థాంక్యూ .."

"ఏమందిరా!"

"భోజనానికి వస్తామనలేకపోయావా!"

అందరూ చుట్టుముట్టారు.

"సరిగ్గా పదకొండుగంటలకు మనకోసం చూస్తానంది"

"అబ్బ! అమెరికా! నీకెంత ప్రశస్తి వుందే తల్లీ! కన్యాదాత దగ్గర నుండి కళాకారుల వరకు నీమీద గౌరవం చూపుతారు!"

సుధీర్ ఓ నమస్కారబాణం పడేశాడు అమెరికాకు. అందరూ అద్దె సూట్లు కాకపోయినా, ఆ మద్రాసు ఉక్కలో, వున్న సూట్లు వేసుకుని వెళ్ళి, నోటికొచ్చిందల్లా కోశారు

విశ్వం మాట్లాడే తెలుగు యాక్సెంట్ చూస్తే ఇంద్రమోహన్‌కు మతిపోయింది తమ నాటకం బయటపడుతుందని తెలిసిపోయింది వాచికేసి చూచుకున్నాడు

"వుయ్ ఆర్ ఎక్స్‌పెక్టెడ్ ఇన్ ద హోటల్, ఎక్జాక్ట్‌లీ ఎట్ ఆఫ్ ఫాస్ట్ ట్వెల్వ్!" లేచాడు

ఆమె ఫ్రూట్‌జ్యూస్ యిప్పించింది అమృతంలా త్రాగి బయటికి వచ్చారు

"ఇంద్రా! నీది కుళ్ళుబుద్ధిరా రాణి నాతో మాట్లాడిందని లేలెమ్మన్నావ్" విశ్వం మిర్రి చూచాడు

"గుడర్డా, షుడర్డా అంటూ ఇంగ్లీషను అచ్చ తెలుగు యాక్సెంటులో ఏడుస్తుంటే, అరగంటలో తేలిపోతుంది, తమరు అచ్చ పెద్దాపూర్ బాపతని" రెండు అంటించాడు ఇంద్రమోహన్

"తనే అందకాడిని, ఆటకాడిని, మాటకారిని తెగ నీల్గిపోతున్నాడు వీడు" విశ్వం ఏడ్పుముఖం పెట్టాడు

"నువ్వేమిటిరా, ఆ ఉక్కలో టై, కోటు! నీ అవస్త చూడలేక నేను చచ్చాను" అన్నాడు చక్రం

"పోండిరా! రాణిని చూడాలనుకున్న నా చిరకాల వాంఛ తీరింది మీరు ఏమన్నా నేను బాధపడను" అన్నాడు సంబరంగా

"అయితే పదండిరా బుహారికి వెళ్ళి, వీడి దగ్గర పార్టీ తీసుకుందాం" అన్నాడు సుధీర్

ఆనాడు అదేదో గొప్ప విషయం అనుకున్నారు ఈనాడు అది తన వ్యక్తిత్వంమీద దెబ్బ తీస్తుందని ఊహించనయినాలేదు

"పోనీ! ఆవిడకు నేనేం సత్యహరిశ్చంద్రుడిని అని రాసిచ్చానా!" అనుకున్నాడు కాని మనసు కుదుటబడలేదు చూస్తుండగానే పేషెంట్ల క్యూ తగ్గింది ఇటు చూస్తుందేమో అనుకున్నాడు ఉహూఁ! కాంపౌండర్ బ్యాగు తెచ్చి కార్లో పెట్టాడు గబ, గబ ఓ చీటి గీకి, వాచ్‌మెన్‌ను పిలిచి అమ్మగార్కి ఇవ్వమన్నాడు

మరో పది నిమిషాల తరువాత రూపాదేవి వచ్చింది

"ఏమన్నారు? నేను రాకపోతే అన్నం మానేస్తారా! మానెయ్యండి ఆరోగ్యం బాగుపడుతుంది అబద్ధాలు ఆడటం మీ వంతే, అలక సాగించటం మీ వంతేనా!" అన్నది

"మీరు ఒక్క నిముషం కూర్చుని సావకాశంగా వింటే..." అన్నాడు

"ఇందాకే మీ మోహన లీలలు విన్నానుగా" అన్నది విసుగ్గా

"ఒక్క నిముషం..." అతను బతిమాలే ధోరణి చూచి కాదనలేకపోయింది. వెళ్ళి కూర్చుంది

**జరిగిన కథ - 6** స్నేహితులు విశ్వం, ఇంద్రమోహన్, పాషా, స్యామ్సన్, చక్రిలు విహార యాత్ర ముగించుకొని హైదరాబాద్ చేరినపుడు ఇంద్రమోహన్ ఐ డి.పి ఎల్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళగా, మిగిలిన స్నేహితులు, అక్క సుగుణ, బావలతో కలిసి ఒక సంబంధం చూస్తాడు విశ్వం ఆమె శ్రీహరి, రుక్మిణిల ఏకైక కుమార్తె డాక్టర్ రూప ఆమె ఆహ్వానంమీద ధనికుడైన విశ్వం బీదవాడైన ఇంద్రమోహన్‌తో నర్సింగ్‌హోమ్ చూడటానికి సాగర్ వెళ్తాడు కానుకలన్నా కోరలేదన్న కారణంగా తనకు, తన చెల్లెలు పూర్ణకు కుండమార్పిడి సంబంధం విఫలమవడం, ఉద్యోగ ప్రయత్నంలో మోసగింపబడడంవల్ల ఇంద్రమోహన్ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు రూప తండ్రి విదేశాలకు వెళ్ళిన సమయంలో ఇంటి వ్యవహారాలు చూసే ఉద్యోగం చేస్తూ ఆమె నడవడి కనిపెట్టటానికి ఇంద్రమోహన్‌ను పంపుతాడు విశ్వం రూప దూరపు బంధువైన శోభన్, ఇంద్రమోహన్‌లతో చనువుగా ఉండటాన్ని క్లినిక్ ప్రారంభోత్సవానికి వచ్చిన విశ్వం గమనిస్తాడు దురలవాట్లకు లోనయిన విశ్వం ప్రవర్తనను గురించి రూప, ఇంద్రమోహన్‌ని ప్రశ్నిస్తుంది.

''అది కాదండీ '' అంటూ జరిగిందంతా చెప్పాడు, ఓ కథలా

''ఒక వయసులో కొన్ని పిచ్చి కోర్కెలుంటా యండీ ఈ అబద్ధం ఎవరికీ హాని చెయ్యదని, ఈ నాటకం ఇంకొకరి జీవితాన్ని దెబ్బ తీయదని ఈ నాటకం ఆడాం అంతే అంతేనండీ ''

రూపాదేవి ఒక్కసారి పక్కున నవ్వింది ఆపుకోలేనట్టు నవ్వుతూనే ఉంది

''ఏం చేస్తున్నారు మోహన్ ?'' శోభన్ వచ్చాడు

''పువ్వులేరుకుంటున్నాను ''

''నట్టు లూజయిందా !'' కణత దగ్గర వేలుపెట్టి తిప్పి చూపాడు

''ఇందాక డాక్టర్‌గారు నవ్వుతూ పువ్వుల వర్షం కురిపించారంటే వినవేం ?''

రూపాదేవి నవ్వు ఆపి లేచింది అతని ముఖం చూడగానే అనదలచిన మాటలు గొంతులోకి వెళ్లిపోయాయి ''చూడు శోభన్ '' అతను చెప్పిందానికి కాసిన్ని అతిశయోక్తులు జోడించి తనూ చెప్పింది రూపాదేవి శోభన్ కూడా నవ్వాడు

''అన్యాయం .. అన్యాయం ! నేను నూ ఓసుకోలేదు మీ కాబోయే శ్రీవారే వేసుకున్నారు '' అన్నాడు

''విశ్వం రానియ్యండి, ఇద్దరూ కలిసి నవ్విస్తాం, అనేవరకు ఏడ్పించకపోతే నా పేరు రూప కాదు ''

''పోనివ్వండి అపురూప అంటాము, సరా'' అన్నాడు ఇంద్రమోహన్ వారు కారు ఎక్కుతుండగా రూపాదేవిని పిలిచాడు

''రూపాదేవిగారూ !''

''ఇంద్రజాలికుడుగారూ !''

''ఈ విషయం మీతో చెప్పానని విశ్వంతో అనకండి '' ప్రాధేయపూర్వకంగా చూచాడు

''సరే '' ఆమె తల పంకించి వెళ్లిపోయింది ఇంద్రమోహన్ తేలికగా ఊపిరి పీల్చాడు

## 13

నర్సింగ్‌హోమ్‌లో కాన్పుల విభాగం కూడా నడుస్తుంది గైనకాలజిస్ట్ వందనను అప్పాయింట్ చేశారు ఆమె దూరంగా ఫైలాన్ కాలనీలో, స్నేహితురాలి దగ్గర వుంటుంది ఇంద్రమోహన్‌కు, పని మరింత ఎక్కువయింది తమ్ముడు పరీక్షలు సక్రమంగా వ్రాశానని తెలిపాక, నిశ్చింతగా నిట్టూర్చాడు రూపాదేవి వివాహము మళ్లీ వాయిదా పడింది శ్రీహరి అక్కడనుండి, లండన్‌లో ఆరునెల లుండాలని, వివాహం చేసెయ్యమని తండ్రిగార్కి వ్రాశాడు

''వాళ్లు తొందరపడితే అలాగే తాతయ్యా'' అన్నది రూపాదేవి తండ్రి లేనిది వివాహమంటే అంతగా యిష్టంలేకపోయినా అనతలి వారిని కూడా యిబ్బంది పెట్టకూడదనుకుంది

''వారిని రానివ్వండి'' అని వ్రాశాడు విశ్వం ఇంద్రమోహన్ అక్కడక్కడా ఉద్యోగానికి ప్రయత్నం చేస్తున్నాడు

ఆ రోజు బ్యాంక్ పరీక్ష వ్రాసి వస్తున్నాడు రోడ్డువారగా రెండెడ్లబండి ఉంది అందులో నుండి, ఓ కోమల కంఠము అరుపులు, పెద్దవాళ్ల అదిలింపులు వినిపిస్తున్నాయి

''అమ్మో . అమ్మో ! నేను బ్రతకనమ్మో, నాకు కడుపులో నొప్పి నాన్నా '' హృదయ విదాయకంగా ఉన్నాయి ఏడుపులు

ఇంద్రమోహన్ ఆగాడు

''ఏమండీ ! దిగండీ యెక్కడయినా ఆస్పత్రి ఉందేమో చూడండి'' స్త్రీ కంఠము వినిపించింది

ఇంద్రమోహన్ బండి వెనక్కు వెళ్లాడు

''ఏమయిందండీ ! యెవరు మీరు ?''

''యెవరయితేనేం బాబూ ! దిక్కులేనివాళ్లం మా అమ్మాయి ప్రమాద స్థితిలో ఉంది'' పురుషుడు క్రిందికి దిగాడు

ఆ బండిలోని కోమల కంఠం అరుస్తూనే ఉంది

''నేను ఆస్పత్రిలోనే పనిచేస్తాను పదండి ''

''బాబూ. '' సందేహిస్తూ ఆగిపోయా డాయన

''తరువాత మాట్లాడుకుందామండీ, డబ్బు లేకపోయినా పరవాలేదు మీరింటికెళ్లి పంపండి ''

''డబ్బు విషయం కాదు బాబూ ! పరువు విషయము మా పిల్ల జీవిత సమస్య...'' ఇంద్రమోహన్ చెయ్యిపట్టి దూరంగా లాక్కు పోయాడు అతను చెప్పింది విని తెల్లబోయాడు పరువూ, పరువూ అనేవారి పరువే బజార్లో పడుతుంది యెందుకో !

''అలాగేనండీ ! ప్రమాణం చేస్తున్నానుకదా ! మీకు, నాకు, డాక్టరిగార్కి తప్ప ఈ విషయం యెవరికీ తెలియదు ''

''నీ కష్టం ఉంచుకోను బాబూ ''

''అమ్మో ! అబ్బా ''

త్వరగా బండిని హాస్పత్రికి తీసుకువెళ్లాడు అక్కడవారిని వదిలి, రూపాదేవి ఇంటికి వెళ్లాడు అందరూ లేవడం ఎందుకని, ఆమె పడక గది కిటికీ దగ్గర నిలబడి పిలిచాడు

''రూపాదేవీ డాక్టర్‌గారూ !'' కిటికీ రెక్క టప టప కొట్టాడు

''ఆ యెవరూ !'' ఆమె చటుక్కున లేచింది లైటు వేసింది లోపలి గది పట్టపగల్లా అయింది చెదిరిన కుంకుమ, గాలికి అల్లాడే ముంగురులు, అస్తవ్యస్తంగా కట్టుకున్న బట్టలు ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి

''ఎవరంటే ''

''నేనండీ ఇంద్రను ప్రసూదమయిన కేసు వచ్చింది ''

''ఓ శోభన్‌ను లేపుతాను వుండండి ''



## పాడులోకం

ఆలోచనకి
సిగరెట్టు తాగుదామంటే
ఆరోగ్యానికి హానికరం అంటారు
మజా కోసం
మత్తుపానీయం సేవిద్దామంటే
మద్యనిషేధం అంటారు
కాలక్షేపానికి
ఇంట్లో పిల్లలతో ఆడుకుందామంటే
ఎర్ర త్రికోణం అంటారు
ఏమీ తోచక
రోడ్డుమీద షికార్లు చేద్దామంటే
రోడ్డుసైడ్ రోమియో అంటారు
అందుకే
ఈ జీవితంలో లేదు అనురక్తి
పెంచుకోవాలనిపిస్తోంది విరక్తి

— దినకర ప్రసాద్

''వద్దండీ, గైనిక్...''

''వందసు దగ్గరకు వెళ్ళలేకపోయారా'' జుట్టు ముడి వేసుకుంది

''ఆ అమ్మాయి తండ్రో మూర్ఖుడండి మీరు త్వరగా రావాలి'' ఆమె ఆవులిస్తూ వంటామెను లేపింది తలుపేసుకొమ్మని చెప్పి కారు తాళం చెవులు తెచ్చింది

''ఆఁ . ఆఁ టైమెంత!'' ఆవులిస్తూ అడిగింది

''పన్నెండు గంటలయిందండీ'' అన్నాడు

''మై గాడ్'' ఆవులిస్తూనే కారు బయటకు తీసింది

''మీకు బంధువులా!''

''యెక్కడో చూచినట్టుంది'' అన్నాడు ఆమె అంత నిదురమత్తులోను నవ్వింది

''ఊఁ! పరీక్ష యెలా వ్రాశారు?''

''నాకు బాగానే వ్రాశాననిపించింది వాళ్ళకు తృప్తి కలుగాలిగా అది పోనివ్వండి ఆమె కేదో నాటుమందు మింగించారల్లే ఉంది''

''విడోనా, కన్యా, వద్దనుకున్న బాపతా!''

''నేను అడగలేదు''

ఇద్దరూ దిగారు రూప ఆ అమ్మాయిని చూస్తూనే ముఖం ముడిచింది చెప్పిన పనులన్నీ ఇంద్రమోహన్ చేశాడు గంట తరువాత, ప్రమాదం తప్పిందని తృప్తిగా నిట్టూర్చింది

''మీకు బుద్ధి ఉందా! డాక్టర్ దగ్గరకు తీసుకుపోవద్దా!'' తల వంచుకున్నారు

''ప్రాణాలకంటే పరువు యెక్కువ కాదు'' మూగగా కన్నీరు కార్చారు

''మీకు ఆడపిల్ల ఉంటే, దానికీ స్థితి వస్తే తెలిసేది'' అన్నట్టున్నాయి యెక్కిళ్ళు

''ఇంద్రమోహన్‌గారూ! రాత్రికి ఇక్కడే

# మోహన రూప

ఉంటుంది తెల్లవారాక, తొమ్మిదో నంబరు గదిలోని పేషెంటును డిస్చార్జి చేయించి, అందులోకి షిఫ్ట్ చేయించండి''

''ఓ కె మిమ్మల్ని వదిలేవస్తాను''

''ఏది కావాలన్నా, వీరిక్కడే ఉంటారు అడగండి''

ఇంద్రమోహన్ ఆమెను వదిలి వచ్చేశాడు ఉదయం గది మార్పించటానికి వెళ్ళాడు

''బాబూ! నువ్వా'' రోగి తండ్రి ముఖం అదోలా ఉంది 'యెక్కడ చూచానబ్బా!' వేలుతో గడ్డం రాసుకుంటూ ఆలోచనలో పడ్డాడు

''బాబూ! మా అమ్మాయి గుర్తుంచేవరకు మేం గుర్తుపట్టలేకపోయాం! శని నెత్తిన ఉండి, అన్నింటికి సహృదయంతో అంగీకరించిన నిన్ను కాదన్నాం, ఏదో ఒంక ఉందన్నాం ఇవన్నీ అనుభవించమని ఆ భగవంతుడు నా నుఖాన వ్రాశాడు...'' రోగి తల్లి జుట్రున చీదేస్తూ ఏడ్చింది ఇంద్రమోహన్‌కు అప్పుడు గుర్తుకు వచ్చింది, ఆ అమ్మాయి అలనాటి పెళ్ళికూతురని, ఆ పెద్దవారు ఆమె తల్లి, తండ్రులని

''బాబూ! నీ కడుపున పుడతాంగాని ఈ విషయం...'' అతనొచ్చి చేతులు పట్టుకున్నాడు

''ఏందయ్యా, నా చేతులో డప్పు కనిపిస్తుందా! అది తీసుకుని చాటింపు వెయ్యటానికి'' ఇంద్రమోహన్ చికాకుగా చూచాడు

''మాకు రాసిపెట్టిలేదు బంగారం, నాయనా బంగారానివి'' ఆమె ఏదో అంటూనే ఉంది అతను రోగిని గదిలోకి మార్పించాడు ఆ అమ్మాయి కళ్ళు వాల్చుకుంది అతను క్షణం నిలబడ్డాడు కోరికలనేవి అతి సహజమయినవి కొందరి పాలిట వరాలయితే కొందరి పాలిట శాపాలవుతాయి మాతృత్వం మహత్తరమయిన వరం ఇలాంటి పరిస్థితిలో తీరని శాపం అవుతుంది పెళ్ళి అయినా ఫలానావాడు తండ్రి అన్న పిల్లలకే రక్షణ లేదు సామాజిక నిబంధనలకు ధిక్కరించిన కన్యా సంతానానికి రక్షణ ఎక్కడ!

''సావిత్రీ!''

ఆమె కళ్ళు ఎత్తింది కళ్ళనిండా నీళ్ళున్నాయి

''ఛ . ఊర్కో.. ఊర్కొమ్మంటే ..'' ఆదరణగా, ఆప్యాయంగా ఆమె తల నిమిరాడు.

ఆమె ఒక్కసారి భళ్ళున ఏడ్చింది.

''ఊర్కో సావిత్రీ. ఊర్కొమ్మంటే'' ఎంతో ఆత్మీయంగా, యెంతో ప్రేమగా ఊరడించాడు ఆమె ముఖం దిండులో దాచుకుంది

''మీరు ఆమెను పదే, పదే ఏదో అని బాధపెట్టకూడదు జరిగిందేదో జరిగిపోయింది'' అని చెప్పాడు అతని పేరు సుబ్బారాయుడని చెప్పాడు సుబ్బారాయుడికి ఎన్నో విధాలుగా ధైర్యం చెప్పి బయటికి వచ్చాడు

''ఇంద్రయ్యా! ఒక్క మాట...''

''చెప్పండి రాయుడుగారూ!''

''ఈ విషయం మీ అమ్మ, నాన్నకు కూడా చెప్పవద్దు''

ఇంద్రమోహన్ కోపం తారాస్థాయినందుకుంది

''ఇప్పుడే వెళ్ళి ఓ నాల్గు డజన్ల పోస్ట్‌కార్డ్సు తెచ్చి, మీ బంధువులందరికి ఉత్తరాలు వ్రాస్తాను అలాగే మావాళ్ళకు కూడా'' అన్నాడు చురుగ్గా చూస్తూ

''బాబూ!'' ఆందోళనగా చూచాడు

''చూడండి యెవరో మతి స్థిమితంలేనివారు, ఇలాంటి విషయాలు ప్రచారం చేస్తారేమోగాని, మాకు వేరే ఇతరత్రా పనులు లేవా! ఇప్పుడు అర్థం అవుతుంది యెవరికయినా ఇలాంటి దురదృష్టం సంభవిస్తే, మీరు ప్రచారం చేస్తారన్నమాట'' తీవ్రంగా ఉంది అతని కంఠము

''పొరపాటయిపోయింది బాబూ'' అన్నాడు అక్కడినుంచి వచ్చి, కట్టడం అంతా చూచుకున్నాడు చిల్లర పనులే డబ్బును, సమయాన్ని మింగేస్తున్నాయి అతనికి అలసటగా ఉంటుంది ఒక్క నిముషం తీరికగా ఉండదు ట్యూషన్లు చెప్పటం ప్రారంభము చేశాక అసలు సమయం ఎక్స్‌ప్రెస్ బండిలా పరుగెత్తుతుంది

మధ్యాహ్నం క్యారియర్ విప్పబోతుండగా పోస్ట్‌మ్యాన్ వచ్చాడు రెండుత్తరాలు ఒకటి పూర్ణది, రెండవది విశ్వం వ్రాశారు ఇద్దరూ క్షేమ సమాచారాలే వ్రాశారు చివరగా విశ్వం నా డైరీ సంగతి మరిచిపోవని తలుస్తాను, అన్నాడు విశ్వం మీద పరమ చికాకు వేసింది

''అయ్యగారూ! భోజనం అయ్యాక అమ్మ రమ్మని అంటున్నారు''

భోజనం ప్రక్కకు పెట్టి వెళ్ళాడు

''పిలిచారట'' ఆమె వెళ్ళబోతుంది

''మీరు భోజనం చేస్తున్నారేమో శోభన్‌కు పోస్ట్‌గ్రాడ్యుయేట్ చెయ్యాలని ఉందట జూన్ వరకు మనకో అసిస్టెంట్‌ను చూడండి'' అన్నది ఏదో ఆలోచిస్తూ

''మీరు నిశ్చింతగా ఉండండి ఒక్కరిని చూడబోతే పదిమంది తటస్థపడతారు'' హామీ ఇచ్చాడు

''విశ్వం హైద్రాబాద్ రమ్మని వ్రాశారు రెండు రోజులు కాస్త చూసుకుంటారు కదూ!''

''ష్యూర్! ఒక్క విషయం వింటారా! నన్నో స్నేహితుడిగా భావించి అపార్థం చేసుకోవద్దు''

''అబ్బబ్బ! చెప్పండి ..'' నవ్వింది

''కాస్త రిజర్వ్‌గా ఉండండి వాడు చాలా మంచివాడు వాడి చుట్టూ ఉన్నవాళ్లే సంకుచితులు'' అన్నాడు

''మీరు నన్నేం అనుకుంటున్నారు?. '' ఆమె ముఖం ఎర్రబడింది అలా అనవల్సింది కాదేమో అనిపించింది

''మీరు ఏం అనుకోవద్దని మొదటే చెప్పాను'' అన్నాడు ప్రాధేయపూర్వకంగా

''మీరు మొదటే ముందటి కాళ్లకు బంధం వేస్తారు చతురులు అవునూ, నన్నో ఫూల్‌ను చేసి, మీరు పెద్ద విశాల హృదయులు అయిపోతున్నారు'' కార్లో కూర్చుని డోరు వేసుకున్నది

'మిమ్మల్నా! నేను ఫూల్‌ను చేశానా!''

''కాక! భోజనం చేసి రండి, చెబుతాను''

''మీరు నా గుండెల్లో ఆటంబాంబు పేల్చారు ఇంకెక్కడి భోజనం!''

''అయితే రండి, అక్కడే తిట్లు, అన్నం హాయిగా భోజనము చేద్దురు.. వాచ్‌మెన్! అయ్యగారి గదికి తాళం పెట్టు'' ఆజ్ఞాపించింది

''ఏం చేశానా దేవుడా!'' అనుకుంటూ కూర్చున్నాడు

''మీ గుండె చాలా గట్టిదండీ'' అన్నది

''మీరెప్పుడు చూచారు?''

''ఇందాకే అన్నారు ఆటంబాంబు పేలిందని అది పేలాక కూడా, మీ గుండె బద్దలు కాలేదంటే గట్టిది కాదా!''

''ఓ... అదా'' నవ్వేశాడు

''సుబ్బారాయుడుగారు మీ బంధువట కదా''

''బంధువా!...'' తెల్లబోయి చూచాడు తనను ఏం చెప్పవద్దన్నాడే, తనేలా చెప్పాడు!

''పాపం! అమ్మాయిని చూచిన ప్రతి వరుడూ అమ్మాయికి చదువు రాదని తిరిగి వెళ్లేవారట ఆయనకేం తోచక, ఓ ట్యూటర్ని పెట్టాడట. అంతే, అతను అమ్మాయిని బుట్టలో వేశాడట''

''ఆ దురదృష్టపు పెళ్లికొడుకుల లిస్ట్‌లో నేను ఉన్నాను''

''ఓ. చెప్పరేం?'' అన్నది, కారును స్పీడ్‌గా టర్న్ చేసి అతను ఎగిరి మళ్లీ సీట్లో పడ్డాడు

''నా లైఫ్ ఇన్సూర్ చెయ్యలేదండీ.'' అన్నాడు

''ఇలాంటి జర్కుల్స్ యెంత థ్రిల్లింగ్‌గా ఉంటాయో మీకేం తెలుసు!'' అన్నది కారు ఇంటి ముందు ఆపి

''నా ప్రాణం ఎగిరిపోతుంటే, మీ తమాషా ఏమిటండీ'' అన్నాడు తనూ దిగి

''వడ్డించెయ్యమ్మా! ఒక్క నిముషంలో వస్తాను''

కర్మ! ఏదో సీరియస్‌గానే వున్నట్టుంది అనుకున్నాడు మెడమీద కత్తిపెట్టి, నోట్లో అమృతం పోస్తాను అన్నట్టుంది

ఆమె స్నానంచేసి వచ్చింది

''ఉరిశిక్ష పడదుగాని కాస్త నవ్వుతూ మాట్లాడండి'' అన్నదామె.

''శోభన్ లేరా?''

''పెళ్లి చూపులనుకుంటాను, హైద్రాబాద్ వెళ్లాడు''

ఇద్దరూ భోజనము ముగించారు

''ట్యాప్ సాంక్షన్ దగ్గర గుమస్తాకు పదిరూపాయలు లంచం యిచ్చారు అది లెక్కలో లేదు...''

''ఏదో రెండోసారి తిరుగలేక యిచ్చాను చిన్న, చిన్న మొత్తాలేకదా...''

''ఈ చిన్నమొత్తాలు మాకు పెద్దగా లాభం కల్గించవుగాని, మీకు తీరని నష్టం కల్గిస్తాయి'' ఆమె వెళ్లి అయిదువందలు తెచ్చి యిచ్చింది

''ఇవి తీసుకోనని మీరంటే, నేను అన్నం తినను అసలు సిమెంటు మిగిలింది పాడవుతుందని రాత్రిళ్ళు పని చేయించి కూలీలకు టీ పోస్తారు. వాచ్‌మెన్‌కు లంచం పెడతారు''

అతను ఏమనలేదు ఎంత భయపడుతూ వచ్చాడు! నిజంగా రూపాదేవి అపురూపమైన వ్యక్తిత్వం గల స్త్రీ, అనుకున్నాడు

''ఏమిటి ఆలోచిస్తున్నారు?''

''ఏం లేదు మీ పేమెంటు సావిత్రిని గూర్చి'' అన్నాడు మీ గురించే అని నిజం చెప్పలేక

''పాపం! పల్లెటూర్లలో కూడా యిలాంటి దారుణాలు జరుగుతున్నాయంటే, మన సినిమాలే కారణం అంటాను''

''సినిమాలే కాదండీ, తల్లిదండ్రులు ఏర్పరిచిన హద్దులు కూడాను ఈ దారుణాలు రూపుమాసిపోవాలంటే, కో ఎడ్యుకేషన్ బదులు రావాలండీ కాలేజి పిల్లలే చెడిపోతారని ప్రచారం'' అన్నాడు

''అదేనండీ! ఒకొక్కసారి ఆలోచిస్తే మనిషి విజ్ఞానవంతుడవుతున్నాడా అజ్ఞానవంతుడవుతున్నాడా అర్థంకాలేదు సుబ్బారాయుడి దృక్పథం చూడండి, మీరు కట్నకానుకలు వద్దంటే ఏదో వంక వుందనుకున్నాడు మగాడు ఈ విషయాలలో కొంత మెరుగేమో!'' అన్నది రూపాదేవి

''ఏ ఆధారంతో అంటున్నారా మాట!''

''మా విషయం చూడండి, నేను అంగీకరించినా, నాకంటే తక్కువ చదివిన వాడెవడూ నన్ను అంగీకరించడని తెలుసు ఒకవిధంగా విశ్వంగారు సాహసమే చేశారు''

''అది పోనివ్వండి సావిత్రి విషయం ఏం చేయమంటారు?''

''మనము ఏమీ చేయలేము''

''విద్యాధికులయిన మీరే తల్లి తండ్రి తెచ్చిన సంబంధం అంగీకరించారు చదువు, సంధ్యలు లేని అతిమామూలు అమ్మాయిని నన్ను

# యువతరం

ఉగాదినాడే పుట్టిన కుమారి ఉగాదికి మొదట వాళ్ల ఊరి— విశాఖపట్నం — కనకమహాలక్ష్మి పేరు కూడా కలిపి కనకమహాలక్ష్మి ఉగాది అని పేరు పెట్టారుగాని తీరా — స్కూల్లో వేసినప్పుడు ఉగాది అని మాత్రం వేయించేశారు అంచేత- ఏ వి యన్ కాలేజీలో బియ్యే చదువుకుంటున్నప్పుడు — ఫ్రెండ్స్ ఆటపట్టించేవారు! అదొక్కటే తప్ప ఉగాదికి తన పేరులాంటి పేరు అరుదుగా వుంటుందని ఎంతో సర్దాట! బియ్యేలో చదువుకుని ప్యాసయింది ''పొలిటిక్స్'' ఐనా, రాజకీయాలంటే అస్సలు వాటి జోలికి పోని ఈ అమ్మాయికి పాటలంటే చిన్నప్పట్నుంచి సరదా—లలితగానం చేయటంలో — మంచి పేరుంది— ఒకసారి అనుకోకుండా స్టేజీ మీద పాడింది. ప్రయిజు వచ్చింది తర్వాత చాలాసార్లు లైట్ మ్యూజిక్ కాంపిటీషన్స్‌లో సినిమా పాటలు పాడి ప్రయిజులు సంపాదించింది!

''అమ్మో! సినిమాలైతేనా? చాలా యిష్టం'' — పైగా వాణిశ్రీ అంటే బాగా ''లైక్'' చేస్తుంది బాగున్న సినిమాకి మరోసారి వెళ్లి చూడటానికి సంకోచంలేదు ఎమ్మే ప్రీవియస్‌కి వెళ్తున్న కుమారి ఉగాది టైపురైటింగులో హయ్యర్ కూడా ప్యాసైంది ఈ కాలపు అందరి ఆడపిల్లలలాగే యీ అమ్మాయికి కూడా కనీసం ఓ రెండేళ్లయినా ఏదైనా వుద్యోగం చేసి ఆనక పెళ్లి చేసుకోవాలనుందిట — కాని ''టీచింగు ప్రొఫెషన్ అంటే'' నచ్చదుట

''యువతరం అంటే జాతి మత కులాలకు అతీతంగా ఉండాలి అన్యాయాన్ని ఎదిరించాలి'' అంటుంది కుమారి ఉగాది తన మట్టుకు తను ''మనస్సుకు నచ్చినవాణ్ణి కులాంతరమైన మతాంతరమైన చేసుకోడమే మంచిది అని భావిస్తుంది ఎందుకంటే జాతి, మతం మానవుడు సృష్టించినవిట! మరి పెళ్లి, ప్రేమా ఎవరు సృష్టించినవో?— అంటే ''యీ ప్రశ్నకి జవాబు నా దగ్గర లేదంది''—

ఈమెకి రేడియో ప్రోగ్రాములు తరచుగా వస్తూంటాయి — కుట్లు, అల్లికలు కూడా నాకు సరదానే — ఇక సుశీల, బాల సుబ్రహ్మణ్యం పాడిన పాటలను పాడటం యెంతో యిష్టం—

స్త్రీ పురుషుల అంతరం సమాజంలో పోవాలి అంటే మొదట స్త్రీ జాతిలోనే మార్పు రావాలి—ఎందుకంటే ''స్త్రీ జాతికి స్త్రీలే శత్రువులు'' అంటుంది ఓటు వేసే వయస్సు యీ ఏడాదే అందుకున్న కుమారి పి ఉగాది



[★★★]

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

కె ఆర్ ఎస్ బి — విజయవాడ

మీకు కొందరు రచయిత్రులమీద అసూయ వున్నట్లుంది లేకపోతే బాగా ప్రచారంలోకి వచ్చిన జొన్నలగడ్డ లలితాదేవిగారిని, పైడిపాటివారిని ప్రతి క్షణం ఆక్షేపణ రూపంలో ఎత్తిచూపిస్తున్నారు ఇది మంచి పని కాదంటాను

★ ఏది ? ఆక్షేపణ రూపంలో ఎత్తి చూపడమా? అసూయపడ్డమా ? ! మీ అనుమాన నివృత్తికి జవాబు చెప్తున్నాను పైడిపాటివారిని చూడనైనా చూశాను జొన్నలగడ్డ వారిని విననేనాలేదు అలాంటి వారిపై అసూయ దేనికి ? నాతో పోటీ కొస్తారనా ? నేను వారికి పోటీ అనా — మీ పిచ్చిగాని ! నా కెవరిమీదా అసూయ లేదు — డూప్లిసిటీ మీదా, ఆడవాళ్లంటే చిన్నచూపు చూసేవాళ్లమీదా కోపం తప్ప

పి వి ఎన్ ఎస్ — నాగపూరు

మీరు స్త్రీ జాతిపై ఎందుకు అభిమానం చూపుతారు ?

★ స్వజాతి వైరం ఎందుకని !

కె ఎమ్ జి — బరోడా

ఫ్రస్ట్రేషన్ అంటే ఏమిటి ? ఎందుకు వస్తుంది ?

★ అనుకున్నదాంట్లో కొంచెమైనా సాధించలేక పోయినప్పుడు; ప్రతిబంధకా లెక్కువై ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేమోనన్న అనుమానం తలెత్తినప్పుడూ ఏర్పడే నిరాశా నిస్పృహలే ఫ్రస్ట్రేషన్ దీన్ని మనోనిబ్బరంతో గెల్చుకురావాలి ఒక్కసారి యిది మనని లోబరచుకుంటే — సమూలంగా కృంగతీస్తుంది

శ్రీహరి — కర్నూలు

భార్యను వదిలేస్తే మగవాడిని సమర్థించే ఈ సంఘం భర్తను వదిలివేసిన భార్యను విమర్శిస్తుంది ఎందుచేత ?

★ లోకువచేత ఈ సంఘంలో తరతరాలుగా ఆడది నోరుమూసుకుని పడివున్నదానికి ఫలితంగానే 'చేతకానితనానికి' విమర్శింపబడుతూవుంది

ఎన్ బి — అల్లినగరం

అనేక పాఠకులకు తగురీతిగా ప్రశ్నల సమాధానములలో మీకున్న ఓర్పు మరువరానిది కాని మీరు ఎక్కువగా స్త్రీలను వెనకేసుకువస్తారు మీకు న్యాయంకాదు

★ పొరపాటు మిస్టర్ బెంజిమిన్, అణగదొక్కబడినవారిని, బడుగు ప్రాణులను, అందరినీ తోసిరాజని ప్రభుత్వమే ఆదుకుంటూ వుంది అందులోకే వస్తుంగికదా స్త్రీ జాతి కూడా ! . ఈ దేశంలో స్త్రీ జన్మ కంటే ఉన్నతమైనదీ, నికృష్టమైనదీ — యింకోటి లేదు ! ఓ చేతో పూజ చేస్తూ రెండో చేతో చితకొట్టే మహానుభావులున్నారు లలిత శృంగార కథానాయికగా అభివర్ణిస్తూ నాల్గుగోడల మధ్య బంధించి స్వేచ్ఛగా గాలీ వెల్తూ చూడనివ్వకపోడమే కాదు తిండి కూడా తిననివ్వని గౌరవనీయులున్నారు స్త్రీకి ఈ దేశంలో సంఖ్యాబలంగా గౌరవమే వ్యక్తిగతంగా మటుకు ఆమె కిచ్చే విలువ సున్నా ! నే వెనకేసుకురావడంవల్ల ప్రయోజనం లేదని తెలుసు కాని — ఎప్పటికేనా తిరగబడరా అన్న ఆశ చావక — రాస్తూంటాను

వి జి — కాకినాడ

మన పురాణాలు భారతాలు స్త్రీని ఎంతో గౌరవంతో చూస్తున్నాయి కదా, అలాటి స్త్రీ జాతి పరువు మర్యాదలను బజారులో అమ్మి సొమ్ము చేస్తున్నాయి కదా సినిమాలు

★ భారతాలకి పురాణాలకి గొప్పలకి పోవడం లక్ష్యం అయితే — సినిమాలకి డబ్బు చేసుకోవడం లక్ష్యం తప్పేముంది ? అవి చదివి ఆహా, ఓహో అనేవాళ్లే ఇవి చూడడానికి డబ్బిస్తున్నారు.

---

# మోహనరూప

తిరస్కరించిందని తప్పపట్టను ఈమధ్య మళ్ళీ కబురుచేశారుకూడానూ...''

''ఇంకేం వివాహం చేసుకోండి ఆదర్శ వివాహం అని వార్తాపత్రికలో నేను వేయిస్తాను'' అన్నది వేళాకోళంగా

''ఏమిటి ? మీకు నవ్వులాటగా వుందా ?''

''తమాషా చేశాను ఒక అమాయకురాలికి కొత్త జీవితం ప్రసాదించడంకన్నా సార్థకత ఏముంటుంది ?''

''అయితే, వివాహం చేసుకొమ్మని అన్యాపదేశంగా హెచ్చరించడమా !'' అతను నవ్వాడు

''అంతేమరి '' ఆ తరువాత ఇద్దరిమధ్యా మాటలు పెగలటంలేదు అతను వెళ్తానని లేచాడు ఆమె లేచి, బయటివరకు సాగనంపింది

ఇంద్రమోహన్‌కు ఆమె సావిత్రిని వివాహం చేసుకొమ్మని సలహా ఇవ్వటం చేదుగా అనిపించింది సరాసరి పోస్టాఫీసుకు వెళ్లి ఆ అయిదువందలు విశ్వానికి మనియార్డరు చేశాడు

## 14

రూపాదేవికి చేతినిండా పని వుంది పేషెంట్లను చూస్తుండగా తొందరగా వచ్చాడు ఇంద్రమోహన్

''ఏమిటండీ ?''

''సుబ్బారాయుడుగారు ఉత్తరం వ్రాశారండీ ఈ జన్మలో రుణం తీర్చుకోలేరట వాళ్లమ్మాయి, తను మనల్ని ఎప్పుడూ మరిచిపోరట...'' ఉత్తరం అందించాడు

''పరవాలేదు మీరు చెప్పారుకదా !'' అతన్ని పరీక్షగా చూచింది నీరసంగా, బలహీనంగా కనిపించాడు

''అదేమిటి మీరలా వున్నారు ?''

''అబ్బే ఏం లేదండీ ! కాస్త అలసట.'' అన్నాడు

''మీలాంటివారికి రోజుకి ముప్పైరెండు గంటలున్నా పనులు ఊరుతూనేవుంటాయి.'' అన్నది వెక్కిరింపుగా

''నా శ్రమను ఒక్క తాతయ్యగారు గుర్తించారు ఒరేయ్ బడుద్దాయ్ ! రాత్రింబవళ్ళు ఇంటి మనిషిలా కష్టపడ్డావ్, అందుకే నర్సింగ్‌హోమ్ పూర్తయింది అని ''

''ఏమండోయ్ ! నేను ఎప్పుడూ తాతయ్య పక్షమే వచ్చి బుద్ధిగా బల్లమీద పడుకోండి .''

''వద్దండీ ! నేను దుక్కలా వున్నాను ''

''ఆ మాటనవలసింది నేను కాంపౌండర్ని పిలువనా !''

''వద్దులెండి '' వచ్చి పరీక్షచేసే బల్లమీద పడుకున్నాడు

ఆమె థర్మామీటర్ నోట్లో పెట్టి పల్స్ చూచింది బొమ్మలు ముడిపడ్డాయి థర్మామీటర్ నూటమూడు డిగ్రీలు చూపింది

''దుక్కలావున్న దుండుముక్కగారూ! జ్వరం చూచారా ! ఎప్పటినుండి ''

''అబ్బే రాత్రేనండి ''

''నాకే అవసరం వచ్చినా మిమ్మల్ని పిలిచి చెబుతానుకదా ! జ్వరం వచ్చినా చెప్పరు నిజంగా మీరు . ''

''తిట్టండి అందమైనవారు తిట్టినా అందంగానే వుంటుంది '' అన్నాడు నవ్వుతూ

''మీరు వెళ్ళి గదిలో విశ్రాంతి తీసుకోండి కదిలారంటే . ''

''కాల్చివేయమని మీ కాపలాదారుకు చెప్పండి'' అన్నాడు లేచి ఆమె మాత్రలు యిచ్చింది అవి తీసుకుని వెళ్లబోతూ ఆగాడు

''నేను పరీక్ష పాసయ్యాను '' అన్నాడు

''చెప్పరేం ? అయితే నాకు మళ్లీ డాన్స్ తప్పదన్నమాట ''

''మీరో పని చేయండి తాతయ్యదో, నాన్నారిదో రికమండేషన్‌తో ఈ ఊరికి వేయించండి అప్పుడు అర్ధరాత్రివరకు మేలుకుని అయినా మీ పనులు చేస్తాను ''

ఆమె అల్లరిగా నవ్వింది అతను సిగ్గుతో తల వంచుకున్నాడు

''ఆఁ నాకు తెలుసులెండి స్నేహితునితో హస్కుకొడుతూ, రెండు జీతాలు సంపాదించ వచ్చని. ''

''మనిషి యితరులకు సహాయంచేస్తూ తన స్వార్థం ముడిపెట్టుకుంటాడు అది చేయనివాడు, మహాత్ముడో, మతిలేనివాడో అయి వుండాలి'' అన్నాడు

''మీతో వాదిస్తుంటే నా ప్రాక్టీస్ దెబ్బతింటుందిగాని వెళ్లి విశ్రాంతి తీసుకోండి '' రూపాదేవి బెల్ నొక్కింది

అతను గదికి వచ్చాడు అతని మనసు అల్లకల్లోలంగా వుంది తనకేం అయింది ? అతని కళ్ళముందు అందంగా వీణ తీగలు మీటుతున్నట్టు కనబడే ఆమె వ్రేళ్ళు కదలాడాయి

[ఇంకా వుంది]

# పెరుగుతున్న సంవత్సరాలు
# కాల్షియం-శాండోజ్®
# సంవత్సరాలు







ఇప్పుడు
అమోఘమైన
కొత్త ప్యాక్‌లో
దొరుకుతోంది.
ఎక్కువ ధర
పెట్టకుండానే.



పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి$^{12}$తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది, ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**

## కాల్షియం-శాండోజ్®
### గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/25D TEL/Rev.

కొత్త సీరియల్ ప్రారంభం

# రాగ ద్వేషాలు



మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

**చీకటి కాంత మెల్లి మెల్లిగా భయంభయంగా వస్తోంది మబ్బుకన్నెలు ఆమె పక్కనే నడుస్తున్నాయి.**

**"నీకు భయంలేదు-నేను తోడున్నాను" అంటూ పౌర్ణమినాటి చంద్రుడు అభయమిస్తున్నాడు.**

**అభయమైతే ఇచ్చాడు గానీ—ఆ కలకత్తా మహా పట్టణంలోని వీధులలో వున్న పెద్దపెద్ద ట్యూబ్ లైట్ల ముందు తనే వెలా వెలా పోతున్నాడు! చీకటి కాంత పారి పోయింది!**

అంతా పట్టపగలు లాగావుంది

కానీ పగలు వుండే ఎండ తీక్షణత మాత్రంలేదు, లైట్లు ప్రసాదించలేని చల్లదనాన్ని చంద్రుడు ప్రసాదిస్తున్నాడు!

ఆహ్లాద పరుస్తున్నాడు!

కలకత్తాలో వున్న లక్షాధికారుల్లో ఒకరైన హనుమంతరావుగారి భవనం రంగు రంగుల కాంతుల్ని వెదజల్లుతోంది!

జనమంతా హడావిడిగ తిరుగుతున్నారు.

రకరకాల కార్లు బయట ఆగివున్నాయి.

ఇల్లంతా పాశ్చాత్య పద్ధతిలో అలంకరించివుంది. ఖరీదైన కర్టెన్లు, కార్పెట్లు, లైట్లు! సోఫా సెట్‌లు, ఫోమ్ బెడ్లు, బీరువాలు!

డ్రస్సింగ్ టేబిల్స్- డైనింగ్ టేబిల్స్ రిఫ్రిజిరేటర్లు! ఎయిర్ కండిషనర్లు, టి.వి సెట్లు– కార్లు!

విలువుటద్దాలూ - పెయింటింగ్స్ - ఫ్లవర్‌వాజులూ! మొజాయిక్ ఫ్లోరింగ్ రికార్డుప్లేయర్లు - టేప్‌రికార్డర్‌లూ! అన్నీ ఖరీదైనవే!

మనుషులూ ఖరీదైనవారే!

అంతాకోలాహలంగా వుంది! సందడిగా వుంది! సరదాగా వుంది!

ఆరోజు ఆయన ఏకైక గారాబుపట్టి ఇందిర పుట్టినరోజు.

మూన్‌లైట్ డిన్నర్ అరేంజ్ చెయ్యబడింది!

పేరుకిమూన్‌లైట్ డిన్నరేగానీ లైట్లు మూన్‌లైట్‌ని కొట్టేస్తున్నాయి!

[36వ పేజీ చూడండి]

# జి. వి. జి. పేజీ

### కృష్ణ శోభన్‌బాబు

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. రఘునాథ్ నిర్మించే శ్రీ విజయకృష్ణ మూవీస్ వర్ణ చిత్రంలో కృష్ణ, శోభన్‌బాబు, సత్యనారాయణ ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రమేష్‌నాయుడు సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, ఎస్. రఘునాథ్ నిర్వహణలో ఈ చిత్రం షూటింగ్ అక్టోబర్‌లో ప్రారంభం.

### విజయనిర్మల దర్శకత్వంలో మరో చిత్రం

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్ వారు సినిమాస్కోప్‌లో నిర్మించే ''మూడు పువ్వులు — ఆరు కాయలు'' వర్ణ చిత్రంలో విజయనిర్మల, కృష్ణ నాయికా నాయకులు. విజయనిర్మల మరో ముఖ్య పాత్ర కూడా పోషిస్తోంది. జగ్గయ్య, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, హలం, ఇతర తారాగణం. జాన్సన్ రచన, సత్యం సంగీతం, ఎస్. ఎస్ లాల్ ఛాయ, తోట శిల్పం, ఆర్. పద్మనాభం నిర్వహణ గల ఈ చిత్రానికి విజయకుమార్, చంద్రకుమార్, జీవన్‌కుమార్, వెంకటరమణకుమార్ నిర్మాతలు.

### ప్రాణమిత్రులు బద్ధశత్రువులు

రాముడు, రంగడు ఒక్క ప్రాణంగా పెరిగారు. పుణ్యకోటి కుట్ర ఇద్దరిమధ్యా విభేదాలు తెచ్చింది. రాముడి పొలానికి నీరు కూడా అందకుండా చేయాలని రంగడు ప్రయత్నించే స్థితికి దిగజారింది వారి శత్రుత్వం. పొలానికి అడ్డు కట్ట వేస్తున్న రంగడితో రాముడు ''నీ కోపమంతా నామీదేగా? ఆ పొలం నాదికాబట్టి నువ్వంత దారుణానికి వొడికట్టావు. వద్దురా — నాకీ పొలం వద్దు. నువ్వే తీసుకో. అప్పుడైనా ఊరివాళ్ళకి నీళ్ళు వదులు'' అన్నాడు.

''నీ మోచేతి కింద నీళ్ళు తాగడానికి నేనేం బిచ్చగాణ్ణి కాదు. నీ చేతనైంది చేసుకో పో!'' అంటూ రాముణ్ని దూరంగా తోసేశాడు రంగడు.

''ఒరేయ్, రంగా! ఇప్పుడు చెప్పేడు మాటలు విని కొట్టావని ఊరుకుంటున్నాను. కాని, నాకు చేతులు రావడంలేదురా! ఎందుకో తెలుసా? నా రక్తంమీద నేనే ఎదురుతిరగగల్నా? ఒరేయ్! నువ్వేసిన అడ్డు కట్ట నీ చేత్తోనే తీయాలి. ఆ మార్పు నీలోనే రావాలి'' అని రాముడనగానే ''హుఁ!'' అన్నాడు రంగడు. అది చూసి ఊరి వాళ్ళంతా రంగడిమీద పడబోయారు.

''చూడండి. ఈ అడ్డు తొలగించాలంటే ఐదు నిమిషాలు పట్టదు. మూకుమ్మడిగా వచ్చి దౌర్జన్యం చేశామన్న చెడ్డపేరు మనకు వద్దు. రండి పోదాం'' అంటూ అందరికీ నచ్చజెప్పి తీసుకెళ్ళిపోయాడు రాముడు.



'మనవూరి పాండవులు'లో కృష్ణంరాజు

కృష్ణంరాజు, శ్రీధర్‌తో పి చంద్రశేఖర రెడ్డి దర్శకత్వంలో తమ్మా రంగారెడ్డి సమర్పించే భారతీ ఆర్ట్ క్రియేషన్స్ ''రాముడు — రంగడు'' వర్ణచిత్రంలో చంద్రకళ, ప్రభ, రావు గోపాలరావు, శరత్‌బాబు, సారధి, ఎం. రంగారావు, అర్జా జనార్దనరావు, గిరగ, అనిత, నిర్మల, స్వర్ణ ఇతర పాత్రధారులు. తెర వెనుక : రాజశ్రీ, చక్రవర్తి, లక్ష్మన్‌గోరే, నాయని మహేశ్వరరావు, మోహన్‌జీ— జగన్‌జీ, మనోహర్‌దత్, భీమవరపు బుచ్చిరెడ్డి. నిర్మాత : తమ్మా రఘునాథరెడ్డి.



'వయసు పిలిచింది'లో కమలహాసన్,

### శ్రీ ఇంటూరి 'సప్తతి' ఉత్సవం

స్వాతంత్ర్య సమరయోధుడు, తొలి తెలుగు సినిమా మాసపత్రిక ''చిత్రకళ'' సంపాదకుడు, తెలుగు సినీ జర్నలిజానికి పితామహుడు అనదగ్గ శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు 70వ జన్మ దినోత్సవం జూలై 1న మద్రాసు సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఛేంబర్ ఆడిటోరియమ్‌లో జరిగింది. మద్రాసు హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ టి. రామప్రసాదరావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు ముదిగొండ లింగమూర్తి, కొసరాజ పి. పుల్లయ్య, కోట సత్యరంగయ్యశాస్త్రి ప్రభృతులు ఇంటూరి గుణగణాలను ప్రశంసించారు. మద్రాసు సినిమా పత్రికా రచయితల సమాఖ్య తరఫున శ్రీ గౌతమ్ సన్మాన పత్రాన్ని సమర్పించాక ఇంటూరి విఖ్యాత రచన ఆధారంగా పద్మనాభం దర్శకత్వం వహించిన ''కథానాయిక మొల్ల'' చిత్రం ప్రదర్శింపబడింది.



శ్రీప్రియ, రజనీకాంత్

### *ముహూర్తంలో ఏముంది ?*

రాజ్‌కపూర్ ఇంట్లో చాలా సందడిగా వుంది. వైవాహిక వార్షికోత్సవం సందర్భంగా అతని నోట అతని భార్య కృష్ణ (ప్రేమ్‌నాథ్ చెల్లెలు) మిఠాయి తినిపిస్తుండగా హఠాత్తుగా టెలిఫోన్ బెల్ మోగింది. ఫోన్ చేసింది జె. జి. మొహ్లా అనే నిర్మాత. అతను పక్కని జ్యోతిష్కుడనీ, ముహూర్తాలు నిర్ణయించడంలో ఘటికుడనీ బొంబాయి సినిమారంగంలో ప్రతీతి. "నీ పిక్చర్‌ను జూన్ 2 న విడుదల చేయబోతున్నావటకదా ? వద్దు. ఆరోజు బాగాలేదు. జూన్ 9 న విడుదల చెయ్యి," అని మొహ్లా యిచ్చిన సలహా ప్రకారమే "సత్యం శివం సుందరం" చిత్రాన్ని విడుదల చేశాడు రాజ్‌కపూర్. ఫలితం అందరికీ తెలిసిందే. ఆ చిత్రం చాలామందికి ఆశాభంగం కలిగించింది. బొంబాయిలో విడుదలయ్యే సమయంలో థియేటర్లలోని వారి నమ్మె కాస్త భయపెట్టింది. "న్యూ ఎరా" థియేటర్లో ప్రదర్శించాల్సిన ప్రింట్లను అతి కష్టంమీద తరలించి "సంగీత" థియేటర్లో రోజుకొక ఆట చొప్పున ప్రదర్శించ వలసి వచ్చింది. "కృష్ణ" థియేటర్లో ప్రదర్శన రద్దు అయింది. ప్రభుత్వపు ఆజ్ఞమేరకు 'మేఫేర్' థియేటర్ మూసివేయబడినందువల్ల అయిదురోజుల తర్వాతగాని ఆ నగరంలో ప్రదర్శించడానికి వీలు లేకపోయింది. బొంబాయి అంధేరాలోని "నవరంగ్"లో ప్రొజెక్టర్లు చెడిపోయినందున రెండోవారంలో కొన్ని ప్రదర్శనలు జరగనేలేదు.

విఖ్యాత దర్శక నిర్మాత వి. శాంతారాం ప్రధాన పాత్ర ధరించిన "దో ఆంఖే బారా హాత్" చిత్రం తొలి షూటింగ్ నాటికి సెట్ తయారవ లేదు. ఆయన "రాజ్‌కమల్ కళామందిర్" స్టూడియోలో అటువంటిదెన్నడూ జరగదు. కాని, బొంబాయిలో వారంరోజులుగా ఎడతెరిపిలేకుండా వర్షం కురుస్తున్నందున సెట్‌కు వేసిన రంగు ఆరలేదు. అంచేత, షూటింగ్‌ను రెండురోజులు ఆగి పెట్టుకుంటే మంచిదని సూచించాడు శిల్పదర్శకుడు. శాంతారాం నిట్టూరుస్తూ, "ఇంకేం చేస్తాం — అలాగే," అన్నాడు. వెంటనే శిల్పదర్శకుడు సంతృప్తిచెంది, "ఇది దైవికంగా జరిగిందనే చెప్పాలి. లేకపోతే అమావాస్యనాడే మీరు షూటింగ్‌ను ప్రారంభించే వారు. మీ జాతకరీత్యా అమావాస్య మంచిది కాదట," అనేసరికి శాంతారాం పిడికిలి బిగిసింది. "నాకు నా కృషిమీద వున్నంత విశ్వాసం ఇలాంటి మూఢాచారాలమీద లేదు. సెట్ ఆరినా ఆరకపోయినా — అమావాస్యనాడే షూటింగ్ ప్రారంభిస్తాను," అంటూ ఆరోజే ప్రారంభిం చాడు. చివరికి ఆ చిత్రం ఆయనకు మంచి రాబడితోపాటు అంతర్జాతీయ ఖ్యాతిని కూడా ఆర్జించిపెట్టింది.

### పేర్ల పొడి అక్షరాలతోనే కార్ల నెంబర్లు

సంగీత దర్శకుడు ఎం. ఎస్. విశ్వనాథం కారు నెంబర్ ఎం. ఎస్. వి. 5052. అలాగే ఎ. ఎన్. ఆర్. ద్విపాత్రాభినయంలో "శ్రీరామ రక్ష" వర్ణ చిత్రం నిర్మించే 'మన సత్యం' కారు నెంబరు ఎం. ఎస్. తో ప్రారంభవౌతుంది.

## సంక్షిప్త చిత్ర వార్తలు

★ కృష్ణ పక్కన పద్మప్రియ తొలిసారి నాయికగా నటించే చిరంజీవి చిత్రవారి "మా ఇంటి దేవత"లో హరనాథ్, జమున, సత్యనారాయణ, పద్మనాభం, మోహన్‌బాబు, శాంతకుమారి, జయమాలిని, మధు, నాగశ్రీ పాల్గొన్నారు. రామకృష్ణ (గెస్ట్). రచన : భమిడిపాటి. సంగీతం : మాస్టర్ వేణు. ఛాయ : జె. సత్య నారాయణ. కూర్పు : సురేంద్రనాథ్‌రెడ్డి. శిల్పం : మూర్తి. నిర్మాణ నిర్వహణ : సుబ్బరాజు. నిర్మాతలు : మహమ్మద్ రంజాన్ ఆలీ, మహమ్మద్ ఖయ్యుద్దీన్. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : పద్మనాభం.

★ కె. వాసు దర్శకత్వంలో మహేంద్ర నిర్మించే టి. వి. ఫిలింస్ "ఏది పాపం, ఏది పుణ్యం" రంగుల చిత్రంలో చంద్రమోహన్, మాధవి, నూతన్‌ప్రసాద్, ఎం. రంగారావు మున్నగువారుంటారు. రచన: గోపి. సంగీతం : సత్యం. సమర్పణ : త్రిపురమల్లు వెంకటేశ్వర్లు.

★ రవి వాణి పతాకంలో శోభన్‌బాబుతో కేశవ జయరాం నిర్మించే వర్ణ చిత్రానికి జి. వి. ప్రభాకర్ దర్శకుడు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలోనే అమరావతీ కంబైన్స్ నిర్మించే "శ్రీకృష్ణ జరాసంధ" వర్ణ చిత్రంలో రామకృష్ణ, శ్రీధర్, సత్యనారాయణ, బాలయ్య, ఉదయకుమార్, జమున, కాంచన, దేవిక పాల్గొంటారు. ఆరుద్ర రచయిత. సాలూరి హనుమంతరావు సంగీత దర్శకుడు.

★ అబ్బూరి నవల "మొదటి గీతం"ను జూపిటర్ ఇంటర్నేషనల్ ఆర్ట్స్ వారు రంగుల చిత్రంగా రూపొందిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : లక్ష్మీశ్రీనివాస్. సంగీతం : వీణ రంగారావు. ఛాయ : బి. జనార్దనరావు. నిర్మాతలు : కొమ్మాని కేశవరావు, ఎన్. వి. రామారావు. అసోసియేట్ డైరెక్టర్ : తోలేటి. నిర్వహణ : జి. ఎన్. గౌతమ్.

మద్రాసులో ఇటీవల సినీహెరాల్డ్ ఫిలిం అవార్డుల ప్రదానోత్సవం జరిగింది. ఉత్తమనటుడు అవార్డు పొందిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఫిలిం అవార్డుల కమిటీ చైర్మన్ శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. చెన్నారెడ్డి, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. జి. రామచంద్రన్‌లను చిత్రంలో చూడవచ్చు.





'దొంగల వేట'లో జయమాలిని

★ ఎస్. డి. లాల్ దర్శకత్వంలో వై. వి. రావ్ సినిమాస్కోప్‌లో నిర్మించే ''లాయర్ విశ్వనాథ్'' వర్ణచిత్రంలో ఎన్. టి ఆర్., సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, కాంతారావు, రాజనాల, శరత్‌బాబు, ముక్కామల, రమణమూర్తి, పెమ్మసాని రామకృష్ణ, భీమరాజు. పొట్టి ప్రసాద్, కె. కె. శర్మ, జయసుధ, కవిత, పండరీబాయి, జయవాణి, సుజాత పాల్గొంటారు.

★ సత్య చిత్రవారి ''కుమార రాజా'' అక్టోబర్ 6న విడుదలయ్యాక అక్టోబర్ నుంచి సూర్యనారాయణ, సత్యనారాయణ ప్రారంభించే మరో సినిమాస్కోప్ వర్ణచిత్రం ''లారీ డ్రయివర్''లో కృష్ణ సరసన జయప్రద నాయిక.

★ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో కె. దేవీవరప్రసాద్ నిర్మించే దేవీ ఫిలిమ్స్ ప్రొడక్షన్స్ వర్ణచిత్రంలో ఎన్. టి. ఆర్., జయసుధ, జగ్గయ్య, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, మాడా ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. డి. వి. నరసరాజు సంభాషణలు, విన్సెంట్ ఛాయ ఇతర ఆకర్షణలు.★

# ఇదొక విచిత్ర పరిశ్రమ!

చలనచిత్ర పరిశ్రమ క్షీణావస్థలో వున్నదని, నష్టాలపట్టీ ఎక్కువగా కనిపిస్తున్నదని మనవాళ్లు ఒకప్రక్క చెపుతునేవున్నారు. మరోప్రక్క వార వారానికి నిర్మాతల సంఖ్య పెరుగుతూనేవుంది. ప్రతివారం రెండు...మూడు చిత్రాల ప్రారంభ వుత్సవాలు జరుగుతూనే వున్నాయి.

విడుదలకు నోచుకోని చిత్రాలు అరవైదాకా వున్నా ... విడుదలవుతున్న చిత్రాలు నూరు దాకా వుండడం ... విచిత్రమైన విషయం.

చిత్ర పరిశ్రమపై ఆధారపడినవాళ్లు ... వేల సంఖ్యలో వున్నా ... దానిపై ఫలితాన్ని అనుభవించేవాళ్లు వంద సంఖ్యలో కూడా లేకపోవడం, గమనార్హం.

### ప్రతిభకు తిరస్కారం

చిత్ర పరిశ్రమలో మరో విచిత్రం జరుగుతూనేవుంది. "ప్రతిభ"ను తిరస్కరించి, "రికమెండేషన్"కు ఎక్కువ ప్రాబల్యం యివ్వడం జరుగుతూవుంది.

కథానాయకుడు చెప్పే వ్యక్తులను నియమించాల్సిన అగత్యం నిర్మాతలకు ఏర్పడడంవల్ల... ఎందరో సమర్థులు రాణించలేకపోతున్నారు.

తెలుగు రచయితలు... రచయిత్రులు ఎందరో వున్నా... తమిళ కథకులు చెప్పే ఆవేశపూరితమైన "నేరేషన్"కు మనవాళ్లు బోల్తాపడుతున్న నిజాన్ని ఎవరూ కాదనలేరు.

ఈ పరిశ్రమ "పచ్చ పచ్చగా" వర్ధిల్లాలంటే... "స్వయం రక్షణ పథకం" ఆలోచించాలి. లేకపోతే "అసమర్థుడి జీవయాత్ర" వలె పరిశ్రమ సాగవలసిందే.

### తిరుపతిలో ప్రారంభమై అక్కడే పూర్తయిన చిత్రం

కుమారి జయచిత్ర "రిక్షా రాజీ"గా సాహసవంతమైన పాత్రను పోషించిన, విజయలక్ష్మి మూవీస్‌వారి కొత్తతరహా సాంఘిక వర్ణచిత్రం, జూన్ ఒకటిన తిరుపతిలో ప్రారంభమై, జూలై 14 కు పూర్తయింది.

నటీనటులను నెల రోజులు తిరుపతిలో నివసింపచెయ్యడానికి, నిర్మాత శ్రీ జి. వి. ఎస్. రాజు మొదట్లో భయపడ్డారు. మొదటి షెడ్యూలుకు "జయచిత్ర... చంద్రమోహన్... మోహన్‌బాబు" వంటి పేరున్న కళాకారులు వచ్చినప్పుడు, వేల సంఖ్యలో అభిమానులు వచ్చి... తమ ఆనందాన్ని ప్రదర్శించి, షూటింగుకు ఎలాంటి అంతరాయం జరగకుండా సంస్కారవంతంగా ప్రవర్తించినందుకు, నిర్మాత శ్రీ జి. వి. ఎస్. రాజు పత్రికాముఖంగా కృతజ్ఞతలు తెలిపారు.

"రిక్షారాజీ" పాత్రకు, కుమారి జయచిత్ర గారిని ఎంపిక చేసినప్పుడు, నిర్మాతను ఎందరో భయపెట్టారు. కానీ, ఆమె తన చిత్రానికి యిచ్చిన సహకారాన్ని చూచి, ఆ రోజు అనినవాళ్ల మాటలకు విస్తుపోయారు. ఎన్నో రోజులు వుదయం ఎనిమిది నుంచి రాత్రి ఒంటిగంట వరకు,

## సినిమా విశేషాలు

కుమారి జయచిత్ర షూటింగులో పాల్గొన్న నిజాన్ని, నిర్మాత రాజు వెల్లడించారు. జయచిత్ర గారి క్రమశిక్షణ శ్రీ రాజుకు బాగా నచ్చింది.

"రిక్షారాజీ" చిత్రానికి దర్శకత్వం వహించిన శ్రీ డి. ఎస్. ప్రకాశరావుకు, యీ చిత్రం "అగ్నిపరీక్ష" లాంటిది. కథను ఆయనే వ్రాసి, చిత్రానువాదాన్ని ఆయనే వ్రాశారు గనుక... చిత్ర విజయం ఆయన శక్తిమీద ఆధారపడివుంది.

"రిక్షారాజీ" చిత్రం తాలుకు పదివేల అడుగుల రషస్‌ను, యిటీవల కొందరు చూసి... ప్రకాశరావుగారికి "పరీక్ష"లో ఫస్టుక్లాసు నిచ్చారు. "రిక్షారాజీ"గా జయచిత్ర ఎంత అపురూపంగా నటించిందో, ఆమెను ఢీకొన్న కథానాయకుడుగా, శ్రీ చంద్రమోహన్ వుత్తమ నటన్ను ప్రదర్శించారు.

ఈ చిత్రానికి జంధ్యాల రచన్ను, సత్యం సంగీతాన్ని, భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని, భాస్కరరాజు శిల్పాన్ని, శాస్త్రి ... శివరాజు ప్రొడక్షన్ను నిర్వహించారు.

మహిళలను ... మాస్‌ను ఆకర్షించే అన్ని అంశాలు వున్న చక్కటి చిత్రంగా "రిక్షారాజీ"ని పేర్కొనవచ్చు.

### విజయలక్ష్మి మూవీస్‌లో జయచిత్ర

"రిక్షారాజీ" కథకు నాయికగా నటించిన జయచిత్ర నటనకు, ప్రవర్తనకు ముగ్ధుడైన శ్రీ జి. వి. ఎస్. రాజు అక్టోబరులో ప్రారంభించే చిత్రంలో కూడా ఆమెనే నాయికగా పెట్టదలచారు.

### ఎన్టీఆర్‌తో చంద్రకళ

తిరుపతి పిక్చర్స్ నిర్మిస్తున్న "స్వదేశీ... విదేశీ" చిత్రంలో శ్రీ ఎన్టీఆర్‌తో కుమారి వాణిశ్రీ ఒక పాత్రను, కుమారి శ్రీవిద్య ఒక పాత్రను పోషిస్తున్న విషయం పాఠకులకు తెలుసు.

"సాహసవంతుడు" చిత్రంలో మరో ముఖ్య పాత్రను కుమారి చంద్రకళ పోషించగలరని తెలిసింది. శ్రీ ఎన్టీఆర్ సరసన చంద్రకళ నటించి చాల సంవత్సరాలైంది.

శ్రీ బాపయ్య చిత్రీకరణలో, మూడవ షెడ్యూలును ప్రవేశించిన "సాహసవంతుడు" చిత్రానికి భమిడిపాటి, మహదేవన్, కన్నప్ప ముఖ్య సాంకేతికవర్గం.

శ్రీ విద్యాసాగర్ నిర్మిస్తున్న యీ చిత్రంలో జగ్గయ్య, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య సహ పాత్రధారులు.

'కటకటాల రుద్రయ్య'లో జయసుధ, జయచిత్ర





* * * * 'రాజపుత్ర రహస్యం'లో ఒక దృశ్యం * * * *



()-()-()-()-()-() 'అనుకున్నది సాధిస్తా'లో ఒక దృశ్యం ()-()-()-()-()-()

# సినిమా

కృష్ణ, జగ్గయ్య, సత్యనారాయణ, హలం, జయమాలిని, అల్లురామలింగయ్య కాల్‌షీట్లు యివ్వడం నిర్మాతకు "కలిసొచ్చిన అదృష్టం" అనే చెప్పాలి

ఈనాటి ప్రేక్షకుడు రెండున్నర గంటలసేపు తనివితీరా ఆనందించి అభినందించే కథావస్తువు 'మూడు పువ్వులు ఆరుకాయలు" చిత్రంలో వుంది

నలుగురు కుమార్లు నిర్మిస్తున్న యీ "సోషియో క్రైమ్" చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచన్ను, రమేష్ సంగీతాన్ని, పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రహణాన్ని సమకూరుస్తున్నారు

పతాక సన్నివేశ చిత్రీకరణకు మాత్రం లక్షన్నర వెచ్చించదలచారు, నిర్మాతలు

### స్వర్గ్ నరక్ హిందీ చిత్రానికి తెలుగు ప్రముఖుని ప్రశంస

విఖ్యాత చిత్ర నిర్మాత శ్రీ బి నాగిరెడ్డి హిందీలో నిర్మిస్తున్న "స్వర్గ్ నరక్" చిత్రాన్ని మరో ప్రముఖ దర్శక నిర్మాత తిలకించారు

ఆయన, చిత్ర దర్శకుడు శ్రీ దాసరికి ఫోను చేసి "చాలా బాగుంది నాకు బాగ నచ్చింది" అని అభినందిస్తూ, మరో కోరికను వ్యక్తపరచారు

"అదేమిటండీ, మీవంటి విలువయిన వ్యక్తి అడగడమ నేను కాదనడమూనా, తప్పక చేస్తానండీ,' అని దర్శకశ్రేష్ఠుడు రిప్లై యిచ్చారు

ఈ ఫోను సంభాషణాన్ని, యీ విలేఖరి విన్నాడు ఇంతకీ అభినందించిన వ్యక్తి, అభినందనలు అందుకున్న వ్యక్తి ఎవరో తెలపాలిగా

అభినందించిన వ్యక్తి శ్రీ ఎల్ వి ప్రసాద్ అభినందన లందుకున్న వ్యక్తి శ్రీ దాసరి

—శ్రీనివాస్ ★

'సీతామాలక్ష్మి' 125 రోజుల పండుగలో శ్రీ పుల్లయ్యనుంచి షీల్డు అందుకుంటున్న సాక్షి రంగారావు — వెనుక శ్రీ మురారి



### 3 చిత్రాలకు "త్రి" దర్శకత్వం

మహిళా దర్శకుల చిత్రాలన్నీ చూసిన ప్రేక్షకులు "మీనా" దర్శకురాలిని ఎక్కువగా అభిమానిస్తున్నారు

ఆమె యిప్పుడు 'త్రి" అంటే మూడు చిత్రాలకు దర్శకురాలుగా పదవీభారాన్ని నిర్వహిస్తున్నారు గౌరీశ్వరి ఆర్ట్ పిక్చర్స్ చిత్రం ఎస్ వి ఎస్ ఫిలింస్ చిత్రం విజయకృష్ణ మూవీస్ చిత్రం

మొదటి చిత్రంలో ఆమె నటించడంలేదు రెండో చిత్రంలో ఆమె రెండు పాత్రలను పోషిస్తున్నారు మూడో చిత్రంలో ముఖ్య పాత్రను పోషిస్తూ, దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు

మొదటి చిత్రంలో నాయికగా నటిస్తున్న జరీనావహాబ్, తెలుగులో చిత్రమంటూ నిర్మిస్తే ఆవిడనే దర్శకురాలుగా ఎంపిక చేస్తుంది

ఇంతకీ ఆ "త్రి" చిత్రాల "స్త్రీ" ఎవరు ? శ్రీమతి విజయనిర్మల

### విజయనిర్మల ద్విపాత్రాభినయం

"మాడమ్' విజయనిర్మల దర్శకత్వం వహిస్తూ వైవిధ్యం వున్న రెండు పాత్రలను పోషిస్తున్న ఎస్ వి ఎస్ ఫిలింస్ వారి "మూడు పువ్వులు ఆరుకాయలు" చిత్రానికి ఇరవై రెండు రోజుల షూటింగు జరిగేందుకు వీలుగా, హీరో

# ఈ ౮ కారణాలకోసం...

























# భారతపు ప్రథమ ప్రెషర్ కుకర్
# నేడు కూడా విపులంగా
# ఉపయోగింపబడుతున్నది



**Prestige**

ప్రెస్టీజ్
టి టి. (ప్రైవేట్) లి.
బెంగళూరు–560 016

MCA/TT/50-Tel

**'కాదు సుమా కథ'**

శ్రీ శ్రీనివాస పద్మావతీ ప్రొడక్షన్స్‌వారు ఈస్ట్‌మన్ కలర్‌లో తీస్తున్న ఈ చిత్రం తొమ్మిది రీళ్లు తయారైంది. జూన్ చివరిలో జరిగే మరొక షెడ్యూలు షూటింగుతో చిత్రం పూర్తి అవుతుందని నిర్మాణ నిర్వాహకుడు ఐ. పి. షా చెప్పారు.

ప్రఖ్యాత దర్శకుడు బి. ఎస్. నారాయణ స్క్రీన్‌ప్లే వ్రాసి దర్శకత్వం నిర్వహించే ఈ చిత్రానికి మాటలు యండమూరి వీరేంద్రనాథ్, పాటలు సి. నా. రె., దాశరథి వ్రాశారు. సంగీతం— ఎం. బి. శ్రీనివాస్ సమకూర్చారు. ఛాయాగ్రహణం — కె. ఎస్. రామకృష్ణారావు, కూర్పు— కుప్పుస్వామి, స్టిల్స్ — శివాజీ.

నటీనటవర్గం—కన్నడ మంజుల, విజయలక్ష్మి, టి. సూర్యకుమారి, కాటూరి లావణ్య, జగ్గయ్య, మురళీమోహన్, నరసింహరాజు, శరత్‌బాబు దాశరథి వగైరా.

సమకాలిక సమాజంలో స్త్రీ ఆలంబనం లేకుండా జీవించటం ఎంత కష్టమో చూపించే కథ గల ఈ చిత్రం నిర్మాతలు ఎ. ఎం. రాజా బి. రామచంద్రరావు, సి. సుబ్బారాయుడు, పంపిణీదారులు — పూర్ణా పిక్చర్స్.

**'అనుకున్నది సాధిస్తా'**

బొదం రంగస్వామి, రామస్వామి సోదరులు భాగ్యనగర్ స్టూడియోస్ జనవరి చివరిలో ప్రారంభించిన 'అనుకున్నది సాధిస్తా' చిత్ర నిర్మాణం ఆరు మాసాల లోపలే జూన్ 8న పూర్తి అయింది కలర్ చిత్రం కావడంవల్ల రికార్డింగు, రీ రికార్డింగు వగైరా మద్రాసులో పూర్తిచేసి జులై లేదా ఆగస్టులో విడుదల చేయాలని అనుకుంటున్నారు

చిక్కులపాలైన అక్క సంసారాన్ని చక్కదిద్దే చెల్లెలి చాతుర్యాన్ని జనరంజకంగా చూపే కథ గల ఈ చిత్రంలో లత ఈ రెండు పాత్రలనూ నిర్వహించింది. ప్రధాన పురుష పాత్రధారులు నరసింహరాజు, త్యాగరాజు, గిరిబాబు, శరత్‌బాబు. అంజలి, నిర్మల, జయమాలిని, మమత నటవర్గంలో వున్నారు.

పి చంద్రశేఖరరెడ్డి డైరెక్టు చేసిన ఈ చిత్రానికి కథ, మాటలు — రాజశ్రీ, పాటలు— దాసం గోపాలకృష్ణ, రాజశ్రీ వ్రాశారు. రమేష్‌నాయుడు సంగీతం, లక్ష్మణగోరె ఛాయ ఈ చిత్రంలోని విశిష్టత అంటున్నారు.

**'జోగి భోగి'**

వేములపల్లి రాధాకృష్ణ అనే సాంకేతిక ప్రవీణుడు అన్నపూర్ణా టెలీ ఫిలింస్ పేరిట 'జోగి భోగి' అనే చిత్రం నిర్మిస్తున్నారు. కొత్త నటులతో కొత్తతరహాలో తీస్తున్న ఈ చిత్రానికి కూడా మే లోనే అంకురార్పణ జరిగింది. తిరుపతిలో వారంరోజులపాటు జరిగిన గంగమ్మ జాతర దృశ్యాలు కొన్ని ఈ చిత్రానికిగాను తీశారు. వివిధ పల్లెల నుంచి ఆ జాతరకు వచ్చిన జానపద పాటకులు, వాద్యకుల బృందాల సహకారంతో కొన్ని పాటలు రికార్డు చేశారు.

**'సమాజం చేసిన పెళ్లి'**

భాను విజేతా ఫిలింస్ అనే కొత్త సంస్థ సి. వి. ఆచార్య అనే కొత్త డైరెక్టరుతో 'సమాజం చేసిన పెళ్లి' అనే చిత్రం తీయనారంభించింది. కథ, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే కూడా డైరెక్టరే వ్రాశారు. మ్యూజిక్ డైరెక్టర్ — బి. శంకర్. ఫొటోగ్రఫీ — ఎస్. వి. పద్మనాభన్, కళ — నాగరాజు, కూర్పు — జగదీశ్.

శ్రీకృష్ణ అనే కొత్త నటుడు హీరో వేషం వేస్తున్నారు. నాయిక పాత్రధారి వాణి, విశ్వనాథ్, రాజేష్, సుజాత, అమృత, సావిత్రి వగైరా ఇతర నటవర్గం.

— ఎం. ఎస్. శర్మ ●

'శ్రీరామ రక్ష'లో జయసుధ, నాగేశ్వరరావు



'రాముడు — రంగడు'లో ఒక సన్నివేశం






రిజిష్టర్డు నెం:2532



# మీరు లక్షాధికారులు కావాలనుకుంటున్నారా..

అయితే చదవండి!
నేడే చేరండి!

## వాణి సేవింగ్ సిండికేట్ లో!



- రూ109లు 5 నెలలలో కట్టండి! 8 లక్షల రూపాయలపైన నగదు బహుమతులు పొందండి!
- మొదటి వాయిదా 25 రూ॥లు కట్టండి! అందమైన 'జిప్ బ్యాగ్' ఉచితంగా పొందండి!




- 5 వాయిదాలు కట్టండి! బ్యాంక్ గ్యారంటీతో క్యాష్ సర్టిఫికెట్ పొందండి!
- జనప్రియ గ్రూపు గడువు 63 నెలలు మాత్రమే! ప్రతినెలా జరిగే డ్రాలలో బహుమతులు గెలవండి!




వివరాలకు నేడే సంప్రదించండి!

G.T. రోడ్... గుంటూరు-1

RADHIKA Geetha

ఇది ఒక ప్రకటన మాత్రమే!

## టాల్‌స్టాయ్ 150వ జయంతి సన్నాహాలు

భారత దేశంలో లియో టాల్‌స్టాయ్‌కి గల సంబంధాలపై ఒక చిత్రాన్ని నిర్మించడానికి సోవియట్-భారత డాక్యుమెంటరీ ఫిలిం నిర్మాతలు సన్నాహాలు చేస్తున్నారు. ఈ రష్యన్ మహా రచయిత 150 వ జయంతి సంవత్సరం సెప్టెంబరు 9 వ తేదీనాడు యీ చలనచిత్రం విడుదల అవుతుంది. మాస్కోలోని స్నేహ భవనంలో జరిగిన సోవియట్-భారత మైత్రీ సంస్థ సమిష్టి సభ్యుల ప్రతినిధుల గోష్ఠిలో యీ విషయం ప్రకటించబడింది. సోవియట్ రాజధానీ నగరంలో యిలాంటి 60 సమిష్టి సంస్థలు సభ్యులుగా వున్నాయి. ఈ గోష్ఠిలో పాల్గొన్న వారు యీ జయంతి ఉత్సవాలకు సంబంధించిన యితర విషయాలను సైతం చర్చించారు.

మైత్రీ సంస్థ ఉపాధ్యక్షులు వై. చెల్యషేవ్ యీ గోష్ఠిలో ప్రసంగిస్తూ యిటీవల తాము జరిపిన భారతదేశ పర్యటన గురించీ, భారత దేశంలోని సాంస్కృతిక కార్యకర్తలతో తాము జరిపిన సమావేశాల గురించీ, సోవియట్ భాషలలోకి అనువాదం జరిగిన భారతీయ రచయితల నూతన రచనలను గురించి వివరించారు.

ఇందిర అలంకరణ కూడా పాశ్చాత్య పద్ధతిలోనే వుంది.

బెల్‌బాటమ్ పంట్- ఫుల్ హాండ్స్ షర్టు- బాబ్డ్ హెయిర్!

మెడలో, చేతులకీ ఏవిధమైన నగలూ లేవు.

బొట్టు అంతకంటే లేదు.

బంగారం రంగు శరీరచ్ఛాయతో, నాజూగ్గా లేత తమలపాకులా, విరిసిన గులాబిలా, అందంగావుంది!

స్నేహితులంతా చుట్టూ వుండగా వయ్యారంగా 'కేక్' కోసిందామె.

చప్పట్లలో మారుమ్రోగి పోయింది ఆప్రదేశమంతా! మరుక్షణంలో అంతా కలిసి "హాపీబర్త్‌డే" పాట పాడారు.

ముందు ఒక ముక్క తండ్రినోట్లో పెట్టింది, కేక్! తండ్రి తిరిగి కూతురి నోట్లో ఇంకోముక్క పెట్టారు. తనే స్వయంగా అందరికీ కేక్ పంచి పెట్టింది ఇందిర.

డిన్నర్ మొదలయింది!

విన్ని పదార్థాలో, విన్నిరకాలో!

తండ్రి-కూతురు అందర్నీ కనుక్కుంటూ తిరుగుతున్నారు!

ఒక వరస సర్వింగ్ అయ్యాక వాళ్ళూ జాయిన్ అయ్యారు.

ఒకగంటా, రెండు గంటలయ్యాక అంతా వెళ్ళిపోయారు.

అందరికీ థాంక్స్ చెప్పి, పంపించారు తండ్రీ-కూతురూను!

చాలా ప్రెజెంటేషన్లు వచ్చాయి ఇందిరకి!

అంతా వెళ్ళేక సంతోషంగా అన్నిటినీ చూసుకుంటోంది, ఇందిర.

## రాగద్వేషాలు

[27 వ పేజీ తరువాయి]

నవ్వుతూ కూతుర్ని చూస్తున్న రావు గారు-

"తల్లీ ఇందూ, అమ్మ ఫొటోకి నమస్కారం చెయ్యమ్మా-" అన్నారు.

పెద్దబొట్టుతో, పట్టుచీరతో వున్న తల్లి ఫొటోకి నమస్కారం చేసింది ఇందిర.

తరవాత ఏమనుకుందో, చటుక్కున వంగి తండ్రి పాదాలకి నమస్కారం చేసింది.

మనస్ఫూర్తిగా ఆశీర్వదించి లేవనెత్తి కూతుర్ని గుండెలకి హత్తుకున్నారాయన!

కళ్ళనీళ్ళు నిండాయి!

ఆప్యాయంగా తుడిచింది ఇందిర.

"తల్లీ, నీకు పెళ్ళి చేసి పంపించాలంటే ఇప్పట్నించే బాధగా వుంది నాకు! నా ప్రాణాలన్నీ నువ్వే! నువ్వుకూడా..."

"నాన్నా- మీ బాధ నా కర్థమయింది. నేనసలు పెళ్ళే చేసుకోను. ఇప్పుడు మనకేం తక్కువయిందనీ? నేనిట్లాగే వుండి పోతాను."

"పిచ్చితల్లీ-ఎన్నాళ్ళని నిన్నిట్లా వుంచుతాను? కానీ, నీ పుట్టినరోజు వస్తే- నువ్వింకో ఏడాది పెద్దదానివైపోయావే... నీకు పెళ్ళి చేసి పంపించాల్సిన బాధ్యత దగ్గిరికొస్తోందే అని... అనిపిస్తూ వుంటుంది! ఏమిటో నా మనసు-మరీ మీ అమ్మ పోయినప్పటి నించీ - నాకే అర్థం గాకుండా పోతోంది! నీకో అండ ఏర్పరిస్తే నాకింక నిశ్చింత. ఏమో నా కేదైనా..."

భయంగా చూస్తున్న కూతుర్ని చూసి మాట మార్చారాయన.

"నాదొక కోరిక- నీకు వీట్లాగైనాసరే -మన వైపు-మన ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చిన సంబంధానికే- అందులో మన బ్రాహ్మణుల అబ్బాయికే ఇవ్వాలి- మన సాంప్రదాయం, పద్ధతులు అన్నీ వున్న కుటుంబంలోనే నిన్నిచ్చి పెళ్ళి చెయ్యాలి... మన తెలుగు దేశం అంటే ఏమిటో - దాని విలువ ఏంతో నీకు తెలియాలి తెలుగు తల్లి నా కన్నతల్లి! మన కృష్ణా, గోదావరి నీళ్ళు నువ్వు తాగాలి! పంటపైరుల నించి వచ్చే ఆ గాలి పీల్చాలి! ఆ నేలలోని తియ్యదనం అనుభవించాలి! అప్పుడు- అప్పుడు- నేను గూడా... ఇవన్నీ... ఈ డబ్బు ఈ వ్యాపారం, అన్నీ వదిలేసి నీ దగ్గరికి వచ్చి వుంటాను. నా కన్నతల్లి వడిలో హాయిగా విశ్రాంతి తీసుకుంటాను."

"సరేనాన్నా. అన్నీ మీ ఇష్టప్రకారమే కానీండి ఇంక పడుకుందామా?" అన్నది ఇందిర లేస్తూ.

"పిచ్చితల్లి అలసిపోయావా? పడమ్మా!" అన్నారు ఉత్తరీయంతో కళ్ళు అద్దుకుంటూ!

* * *

"అమ్మా- ఇందూ!"

"ఏంనాన్నా-?" వచ్చింది ఇందిర. ఫుల్‌మాక్సి వేసుకుంది. తలకి రెడ్ బాండ్.

"అట్లా కూర్చో, నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి-"

కూచుంది ఇందిర.

"నా అక్కయ్యకి అంటే మీ అత్తయ్యకి ఒక కొడుకున్నాడు వాడీమధ్య పారిస్ కూడా వెళ్ళివచ్చాడు. ఏదో కంపెనీలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. నీకిష్టమయితే మా బావ గారికి రాస్తాను. నీకిష్టమేనా చెప్పు!"

అనాది కాల ప్రవృత్తముగా సంగీతము పారంపర్యంగా భారతీయ సమాజంతో నిగూఢంగా నేయబడినది. సంస్కృతి తనంతటతనే ఏ విధంగా మిగుల దైవికంగా భాసించునో, అదే విధముగా, భారతదేశంలో, పక్షులు, జంతువులకే గాక, దేవతలు సంగీత వాద్యములతో విడదీయలేని విధంగా సమ్మిశ్రితమైయున్నారు. స్థితికారకుడైన చతుర్భుజుడైన మహావిష్ణు, ఒక చేతిలో శంఖమును ధరించియున్నాడు; కళలకు, విద్యకు మూలవిరాట్టైన సరస్వతి వీణ మీటుచున్నది; శ్రీ కృష్ణ భగవానుడు సర్వదా వేణువుతో సాక్షాత్కరించును. ఇక శివుని చేతిలో దమరకం.

# దావణగేరె

అనంతమైన నాణ్యతకు మరో పేరు

ది దావణగేరే కాటన్ మిల్స్ లిమిటెడ్,
దావణగేరే. 577 002.

షోరూములు :
చిత్రదుర్గా రోడ్, దావణగేరే 577 002
కావేరి భవన్, బెంగళూర్ 560 009
దాజిబన్‌పేట్, హుబ్లి 580 020.

# రాగద్వేషాలు

తలవంచుకుని నెమ్మదిగా అంది ఇందిర.

"నాన్నా- మీకేదిష్టమైతే నాకూ అదే ఇష్టం-! కానీ, మీరు చూసే సంబంధాల్లో అతడు నాకంటే ఎక్కువ చదువుకుని వుండాలి. తరువాత... నాకు ఫారిన్ కంట్రీస్ చూడాలనీ, అక్కడ కొన్నాళ్ళుండాలనీ వుంది! ఫారిన్‌లో వుండే వాళ్ళైతే- లేదా ఫారిన్ వెళ్ళే అవకాశం వున్న వాళ్ళైతే... నాకభ్యంతరం లేదు..."

"సరేనమ్మా, అట్లాగే! నీ అభిప్రాయం చెప్పావు. చాలా సంతోషం తల్లీ! ఆ అబ్బాయీ ఫారిన్ వెళ్ళొచ్చాట్ట! మళ్ళీ వెళ్ళేందుకూ అవకాశాలున్నాయి. అదృష్టం వుంటే నువ్వూ వెళ్ళొచ్చు అడిగిచూడనా?"

"మీ ఇష్టం."

* * *

"నాన్నా అత్తయ్య దగ్గర్నించి వుత్తరం వచ్చింది!" తెచ్చి ఇచ్చింది ఇందిర.

అది విప్పేవుంది.

ఇందిర ముఖంలోకి చూశారాయన.

నిర్లిప్తంగావుంది.

ఉత్తరం విప్పి చదివారు

"చి. తమ్ముడ్ని ఆశీర్వదించి సుగుణ వ్రాయునది-

ఇక్కడంతా క్షేమం. నువ్వు వ్రాసిన ఉత్తరం అందింది నువ్వు పిలనిస్తానని వ్రాసినందుకు నాకు చాలా సంతోషమేసింది.

అందులో దానికి అమ్మ పేరు కూడా పెట్టుకున్నావు. అదంటే నాకెంతో ఇష్టం. రమేష్ కూడా నామాట కాదనేవాడు కాదు. నాకూ ఒక్క కొడుకు. అయిన సంబంధం చేసుకుంటే అన్నివిధాలా సుఖపడతాను. నీకున్నదంతా నీ తదనంతరం దానికే- నాకు అన్నీ తెలుసు.

కాని, ఎందుకో మా అత్తగారు-మామగారు ఇష్టపడడం లేదు. వాళ్ళ కిష్టం లేనిదే మీ బావగారు ఏపనీ చెయ్యరు. నేనెంతో నచ్చజెప్పాను. అయినా వినలేదు. నేనేం చెయ్యను? కాదని నీకూ చెప్పలేను. నన్ను క్షమించు. ఇందిరకేం బంగారు బొమ్మ. మమ్మల్ని మించిన సంబంధం వస్తుంది దానికి. మాకే ప్రాప్తంలేదు. నువ్వు అన్యథా భావించకు.

ఇందిరకు ఆశీస్సులు వుంటాను నీ మనసు బాధపెడితే క్షమించు.''

ఇట్లు,
నీ అక్కయ్య సుగుణ.

మొహం జేపురించింది.

చాలా కోపం వచ్చింది హనుమంతరావు గారికి "పోనీ ముష్టి సంబంధం! తినడానికి తిండి లేనివాళ్ళకి గూడా గీర్వాణం! ఇంలోటి వాళ్ళు మనకి దొరక్కపోరు...''

సోఫాలో వెనక్కివాలి కళ్ళు గట్టిగా నొక్కుకున్నారు ఆవేశాన్ని అణచుకుంటూ!

ఇందిర కాఫీ అందించింది తండ్రికి.

## 2

హనుమంత రావుగారు మధ్యతరగతి కుటుంబంలో పుట్టారు తండ్రి ఎస్.ఎస్.ఎల్.సి దాకా చదువు చెప్పించి 'ఇంక చెప్పించలేను– ఏదైనా ఉద్యోగం చూసుకో' మన్నాడు

రావుగారికి చదువుకోవాలి– అని కోరిక! పై చదువులు చదవాలని తాపత్రయం! ఎస్ ఎస్. ఎల్ సి లో స్కూలు ఫస్టు వచ్చారు. దాంతో కొంచెం ప్రయత్నించగా స్కాలర్‌షిప్ వచ్చింది.

స్కూలు టీచర్ల సహాయంతో కాలేజీలో చేరారు. శ్రద్ధగా చదువుకుంటూ క్లాసు–క్లాసుకి 'ఫస్టు'వస్తూ స్కాలర్ షిప్‌లతో చదువుకుంటూ, బి.ఎస్ సి పూర్తి చేశారు.

అదృష్టవశాత్తూ స్టేట్ బ్యాంకులో ఉద్యోగం వచ్చింది.

ఇంటికి కూడా ఆర్థిక వత్తిడి కాస్త తగ్గింది.

ఉద్యోగం వున్నది. మొగపిల్లవాడు! ఇంకేం సంబంధాలు రాసాగాయి. కట్నం కూడా బాగా ఇస్తామంటూ వచ్చాయి సంబందాలు. తల్లిదండ్రులు కాస్త మొగ్గు చూపడం ప్రారంభించారు.

రెండు మూడు చూసి వచ్చారుగూడా!

ఇంతలో రావుగారికి ఇంకో వూరికి ట్రాన్స్‌ఫర్ అయింది.

అక్కడ పరిచయమైంది సహోద్యోగిని గీత– ఆ అమ్మాయి ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ ఉండేది. స్నేహ పూర్వకంగా మాట్లాడేది. కొత్తఊరుగదా, కావలసిన సదుపాయాలు కొన్ని చూసి పెట్టింది రావు గారికి.

ఇల్లు దొరికేందుకు సహాయం చేసింది. పనిమనిషిని కుదిర్చింది.

తను వండినవి కొన్ని తెచ్చియిచ్చేది! ఇట్లా ఎన్నో విధాల సహాయం చేసింది.

ఆ అమ్మాయి బెంగాలీ పిల!

కులంకూడా వేరు!

కానీ వీళ్ళిద్దరి స్నేహానికి ఇవేవీ అడ్డు రాలేదు హాయిగా నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకునేవారు.

స్నేహం క్రమంగా ప్రణయంలోకి మారింది! ఒకరి నొకరు విడిచి వుండలేని పరిస్థితి కొచ్చారు. తల్లిదండ్రులతో చెప్పి –వారిని ఒప్పించి పెళ్ళాడాలని ఆయన ఆలోచన.

మొదట ఆ సంభాషణ వాళ్ళ మధ్యకి తేవడానికే భయపడ్డారు. తరవాత నెమ్మదిగా ఎంతో ప్రయత్నం మీద చెప్పారు గీత గురించి.

వాళ్ళు ఒప్పుకోలేదు.

"భాష వేరయినా ఫరవాలేదు ఎట్లాగో సర్దుకుంటాం– బొత్తిగా మన కులం కాకపోతే ఎట్లారా'' అంది తల్లి!

బతిమాలారు– కోప్పడ్డారు– మందలించారు–ఏడ్చారు- తిట్టారు– చివరికి మండి పడ్డారు.

తండ్రి ఉగ్రుడైపోయాడు– "నీకూ మాకూ సంబంధం లేదు. మేము చచ్చామనుకో–ఇంక ఈ ఇంటి గడపతొక్కడానికి కూడా వీలులేదు– పో బయటికి'' అంటూ అరిచాడు!

ఏమైనా తన మొండిపట్టు విడవలేదాయన. మొదట ఉన్న కోపం, కలకాలం వుంటుందా. వాళ్ళే సర్దుకుంటారులే క్రమంగా అనుకున్నారు!

గీతని పెళ్ళి చేసుకున్నారు – రిజిస్టర్ మారేజి చేసుకున్నారు! తన వాళ్ళకి దూరమయ్యారు!

ఆయన పెళ్ళయిన కొన్నాళ్ళకే తల్లి మంచంపట్టి మరణించింది మనోవ్యాధితో! దీనికి కారణం ఈయనేనని బందువులంతా ఈయన్ని దుమ్మెత్తి పోశారు.

తల్లి మరణించిందని వెళ్ళినా ఆ పది రోజులూవున్నా ఒక్కళ్ళూ ఈయనతో మాట్లాడలేదు! ఈయన్ని తల్లికి కర్మ కూడా చెయ్యనీయలేదు! వెలి వేసినట్లు చూశారు! కుల భ్రష్టుడయ్యాడని నిందించారు! మాట్లాడక పదోరోజు దాటగానే తిరిగి వచ్చేశారు, రావుగారు!

ఆ తరవాత కొన్నాళ్ళు ఆ ప్రాంతాల్లో వున్నా, ఇరుగు–పొరుగు వాళ్ళు అనే మాటలకు, చేసే విమర్శలకు, తట్టుకోలేక, ఉద్యోగం రిజైన్ చేసేసి, ఇద్దరూ కలకత్తా వచ్చేశారు!

కలకత్తాలో గూడా కొన్నాళ్ళు కష్టాలే అనుభవించారు. గీత తల్లిదండ్రులు మొదట వీళ్ళని చాలా హీనంగా చూశారు తరవాత–తరవాత రావుగారి మంచితనం తెలిసి వచ్చింది వాళ్ళకి అదీగాక గీత ఒక్కతే పిల్ల కావడంతో వాళ్ళూ ఆమెని వదులుకోలేక పోయారు ఇద్దర్నీ బాగానే చూడడం మొదలు పెట్టారు.

కాలక్రమేణా రావుగారు ఎన్నోఉద్యోగాలు చేశారు. ఏదీ నచ్చక మానేశారు. చివరికి



ధైర్యం చేసి ఒక చిన్న వ్యాపారం మొదలు పెట్టారు.

వ్యాపారం ప్రారంభించిన సంవత్సరంలోనే కూతురు పుట్టింది తన తల్లి పేరే పెట్టుకున్నారు ఇందిర పుట్టిన వేళావిశేషం వల్ల వ్యాపారంలో కలిసివచ్చింది

వేలు — లక్షలయ్యాయి! ఏవిధంగానూ లోటులేక సౌఖ్యంగా కాలం గడప సాగారు!

మధ్య—మధ్య తనవాళ్ళు గుర్తుకొచ్చినా, కావాలనే పనులు కల్పించుకుని ఆ విషయమే మర్చిపోయేందుకు ప్రయత్నించేవారు!

గీతకి ముందే కాస్త తెలుగువచ్చు. తరవాత కావాలని రావుగారి కోసం దానిని అభివృద్ధి పరుచుకుంది!

తెలుగు గృహిణి లాగానే వుండేది.

కాని తెలుగు వంటలు కుదిరేవి కావు.

రావుగారుకూడా తెలుగు వంటలకీ — తెలుగు తనానికీ మొహంవాచి పోయారు. తను పోగొట్టుకున్న దేమిటో — దాని విలువ ఎంతో తెలిసిరాసాగింది. ప్రేమ వివాహం ఆదర్శ వివాహం చేసుకున్న వాళ్ళంతాలవలాగే అనుకుంటారేమో. అనిపించింది ఆయనకి!

కానీ పైకేమీ వ్యక్తం చెయ్యలేక పోయేవారు. వర్ణాంతర వివాహం భాషాంతర వివాహం కావాలని చేసుకుని ఇప్పుడిట్లాఅను కోవడం అవివేకం అనుకున్నారు

కానీ అయనకి వద్దనుకున్నా తెలుగువాళ్ళ అలవాట్లు, సంప్రదాయాలూ కావాలని పించేది! తత్ఫలితంగా ఇంట్లో అంతా అవి ప్రవేశ పెట్టారు.

గీతకి కొంచెం కష్టంగా వుండేది ఇవి

# రాగద్వేషాలు

చూసి! ఇద్దరికీ చిన్నచిన్న కలహాలు తల ఎత్తేవి!

"మీ కోసమని మాంసం తినడం మానేశాను, చేపలు మానుకున్నాను తెలుగు నేర్చుకున్నాను. మీ వాళ్ళలాగే ఉండాలని కట్టు బొట్టు మార్చుకున్నాను ఇంకా ఏం చెయ్యను? అయినా ఎందుకు చెయ్యాలి?" అనేగి విసుగు కలిగి.

కోపంవచ్చి ఆ మాటలకి భోజనం మానేసేవారు రావుగారు

రెండు—మూడు రోజులకి గాని మళ్ళీ కలిసేవారు కాదు. కూతుర్ని దగ్గిర కూచో బెట్టుకుని, 'అమ్మ, నాన్న, అక్క' అంటూ అన్నీ తెలుగు మాటలు నేర్పేవారు.

'కాళ్ళా గజ్జా—కంకాళమ్మ'

'గుడి గుడి గుంజం గుండెరాగం'

'చెమ్మ చెక్క చేరడేసి మొగ్గ' లాంటి ఆటలన్నీ నేర్పేవారు,

కూతురితో తెలుగే మాట్లాడేవారు. గీత మనసులో ఏమనుకున్నా పైకి మాత్రం ఏమీ అనేదికాదు.

కానీ కూతుర్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళి నెలరోజులుండి వచ్చేటప్పటికల్లా— తండ్రి నేర్పినవన్నీ మర్చిపోయేది ఇందిర!

అంతా బెంగాలీనే మాట్లాడేది, ఆ ఆటలే ఆడేది! కోపం వచ్చి, "ఈసారి నువ్వు పుట్టింటికి వెళ్ళినా, ఇందిరని మాత్రం తీసుకు వెళ్ళడానికి వీల్లేదు" అని శాసించేవారు.

మళ్ళీ శ్రమపడి అన్నీనేర్పేవారు ఇందిరకి. ఇట్లాగే రోజులు గడిచాయి.

ఇందిరకి స్కూలుకు వెళ్ళే వయసు వచ్చింది తెలుగు పట్టుబట్టి నేర్పించారు. తెలుగు వాళ్ళ సాంప్రదాయ ప్రకారమే అక్షరాభ్యాసం చేయించారు. పెద్ద బాలశిక్ష చదివించారు. ఇంట్లో రోజుకో గంట తనే తెలుగు నేర్పేవారు కూతురికి.

ఇందిర కూడా తండ్రి చెప్పినవన్నీ ఇష్టే నేర్చుకునేది. పద్యాలన్నీ కంఠస్థం వచ్చాయి. సుమతి శతకం, వేమన శతకం, దాశరథీ శతకం, కుమారీ శతకం, సుభాషితాలు అన్నీ నేర్చుకుంది! స్కూల్లో, సెకండ్ లాంగ్వేజి సంస్కృతం ఇప్పించారు బెంగాలీ అలవాట్లు రాకుండా చాలా జాగ్రత్త తీసుకున్నారు.

గీత కొన్నాళ్ళు వాదించినా తండ్రీ కూతురూ ఏకమవడంతో మౌనంగా వుండి పోయింది.

కొన్నాళ్ళకి ఇంట్లో ముగ్గురూ తెలుగు మాట్లాడు కోవడం పూర్తిగా అలవాటు చేసుకున్నారు ఎప్పుడయినా అవసరమయితే ఇంగ్లీషులో మాట్లాడుకునే వారు. ఇందిరకి పరిసర ప్రాంత ప్రభావం వల్ల బెంగాలీ ఎట్లాగూ వచ్చింది.

ఇన్నేళ్ళల్లోనూ— రెండు మూడు సార్లు తను మాత్రం వెళ్ళి తన వాళ్ళని చూసి వచ్చారాయన. వాళ్ళు సుముఖంగా వుంటే భార్య పిల్లని గూడా తీసుకు వెళ్దామను కున్నారు. కానీ వాళ్ళు ముభావంగానే వున్నారు. తనూ ముభావంగానే వుండి పోయారు. పెద్దయిన కొద్దీ ఇందిర కొంత పాశ్చాత్య నాగరికత మీద మోజు చూపించ డం ప్రారంభించింది కొంత కంట్రోల్లో పెట్టినా కొన్నిటికి ఊరుకున్నారు రావుగారు. ఇందిర ఇంటర్ పాసయింది అప్పటికి! ఆమె పెళ్ళి విషయంలో మాత్రం దృఢ నిశ్చయంతోనే వున్నారు. తెలుగు పిల్లవాడు అందునా బ్రాహ్మణ పిల్లవాడికే ఇచ్చి చెయ్యాలి కూతుర్ని అని!

కానీ భార్య నవ్వి చెప్పేది "మీరు కులాంతర వివాహం చేసుకున్నారు. మన పిల్లని ఏ బ్రాహ్మణ కుటుంబమైనా ఎట్లా చేసుకుంటుంది?" అని!

"నువ్వు చూస్తూ వుండు— నేను చేస్తాగా?" అనేవారాయన నవ్వుతూ!



ఇందిరకి పదహారో ఏడు రాగానే గీతకి విషజ్వరం వచ్చి ఒక వారంలోనే ఆవిడ చనిపోయింది.

భార్య మరణం రావుగార్ని బాగా క్రుంగదీసింది! ఆ దెబ్బకి తట్టుకోలేక పోయారు! చిన్నపిల్లవాడిలాగా ఏడ్చారు! పిచ్చిపట్టినట్లు అయిపోయారు! ఆయన తేరుకోవడానికి ఒక సంవత్సరం పట్టింది అప్పట్నించి ప్రాణాలన్నీ కూతురి మీదే పెట్టుకుని బతుకుతున్నారాయన. చిన్న మాటకైనా కూతురు ఎదురు చెబితే చాలా కోపం వచ్చేది ఆయనకి. ఆయన్ని కంటికి రెప్పలాగా చూసుకోవడం నేర్చుకుంది ఇందిర! ఎంతగా గారాబాలు పోయినా తన హద్దు దాటేది కాదు ఎప్పుడూ గూడా! తండ్రి ఇష్టప్రకారమే బి. ఏ. లో చేరింది! ఆయన మాట వేద వాక్యం లాగే పాటించేది!

(ఇంకా ఉంది)

ఈనాటి వనితాలోకం

# స్త్రీ పురుషుల మధ్య స్నేహం తగునా?

మార్పు - పరిణామాలు సమాజం యొక్క సహజమైన గుణాలు, మారుతున్న సమాజంలో పాత భావాలు, పద్ధతులు అంతరించి, నూతన భావాలకు, విధానాలకు అంకురార్పణ జరుగుతుంది నాటి సమాజంలో "స్త్రీ" - ఎవరో కొందరు వేళ్ళపై లెక్కబెట్టగలిగేంత మంది స్త్రీలు తప్ప - ఈనాటి సగటు స్త్రీ జీవితం ఆమె ఆశలు, ఆశయాలు కేవలం వంటింటి వరకే పరిమితమై వుండేవి. తనచుట్టు ఉన్న సమాజం సమాజ పరిస్థితులు, ఇవన్నీ ఆనాటి స్త్రీ మేధస్సుకు కూడా అందని విషయాలు - కాని ఈ నాటి స్త్రీ సమాన హక్కులతో సమాజంలోని వివిద రంగాలలో చైతన్యవంతంగా పాల్గొంటు దేశ పురోభివృద్ధికి పురుషునితో సమానమైన పాత్ర వహిస్తున్న ఆధునిక మహిళ, ఆనాటి స్త్రీకి బహిర్ సమాజంతో ఎక్కువ సంబంధాలు వుండేవి కావు కనుక పురుషునితో కలిసి తిరిగి, కలసి వ్యవహరించే పరిస్థితులు అవకాశాలు లేకుండేవి. కాని ఈ నాటి వనితకు జాతి నిర్మాణంలో, వివిధ రంగాలలో పురుషునితో సమానమైన బాధ్యత వుంది. కనుక తప్పనిసరిగా అతనితో కలసి తిరిగే, వ్యవహరించే అవసరం ఎంతో వుంటుంది.

అయితే ఈనాడు మనదేశం పారిశ్రామికంగా, శాస్త్రీయంగా ఎంతో ముందడుగు వేస్తున్న మన సమాజంలో, సామాజిక వ్యవస్థలో మాత్రం చెప్పుకోదగినంత మార్పు కనిపించుట లేదు పాత భావాలను, ఆచారాలను, సాంప్రదాయాలను పూర్తిగా విసర్జించలేక కొత్తవాటిని జీర్ణించుకోలేక సతమతమౌతున్న దశలో ఈ నాడు మన సమాజం వుంది అందువల్లనే ఒక స్త్రీ - ఒక పురుషునితో స్నేహంగా వుండటం

- కుమారి మానుపాటి గీతాంజలి.

సర్వసాధారణమైన విషయంగా కాక ఒక చర్చనీయాంశంగా తయారవుతున్నది. ఈనాడుకూడా "స్త్రీ పురుషుల స్నేహం" అనేసరికి చాలమంది కనుబొమ్మలు ముడిపడతాయి కారణము మన వ్యవస్థ అలాంటిది మన స్థితిగతులు వేరు కాని నేడు మారుతున్న కాలానుగుణంగా మనము పురుషులతో స్నేహభావంగా మెలగడం ఎంతో అవసరము అది కేవలం శారీరకమైన ఆకర్షణ వ్యామోహం అనే దృఢభిప్రాయం చాల వుంది కనుకనే ఒక అమ్మాయి, ఒక అబ్బాయితో స్నేహంగా మసలుతుంటే ఆమె శీలాన్ని శంకిస్తు దుష్ప్రచారం ప్రారంభమవుతుంది. తోటివారి సూటిపోటి మాటలు, అపనిందలు, అవహేళనలు, నీచమైన వ్యాఖ్యానాలు ఎదుర్కోవాల్సి వస్తుంది చివరకు ఈ దుష్ప్రచార ప్రభావం వల్ల ఆ అమ్మాయి

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతి రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతి ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడె శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీముతో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతీ రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL-1

# ఈనాటి వనితాలోకం

వివాహ విషయము ఒక సమస్యగా పరిణమిస్తుంది. కన్నెపిల్లల పరిస్థితులు ఇలా వుంటె ఇక వివాహితురాలైన స్త్రీ పరిస్థితి మరీ దయనీయంగా వుంటుంది. పెళ్ళయిన స్త్రీ పరపురుషునితో కొంచెం స్నేహంగా, చనువుగా మాట్లాడుతే అది మన సంఘము అనుమతించదు. అది ఆమె భర్త చూస్తే ఈర్ష్యజనించి అతనిలో అనుమాన బీజాలు అంకురించి, ఇరువురి మధ్యా అభిప్రాయ భేదాలు, పరస్పరారోపణలు ప్రారంభమౌతాయి. అంతేకాకుండ అత్త, మామలు, ఆడపడుచుల తీక్షణ శరాఘాతాల్లాంటి మాటలకు కూడా ఆమె గురికావల్సివస్తుంది.

ఈ విధంగా స్త్రీ తనచుట్టూ ఉన్న సమాజంనుండి అపనిందలను, అవమానాలను ఎదుర్కోవడమే కాకుండ కొన్ని కొన్ని సార్లు తనతో స్నేహంగా మసలుతున్న వ్యక్తివల్ల అతని ప్రవర్తన వల్ల కూడ అభాండాలకు గురికావాల్సి వస్తుంది. ఓ అమ్మాయి తనతో స్నేహం చెయడానికి ముందుకు వస్తుందంటే ఇతరులలో లేని గొప్పతనం, ప్రత్యేకత, ప్రతిభ ఏదో తనలోవుందని ఆ వ్యక్తి ఊహించుకుంటాడు. ఆమె స్నేహాన్ని అపార్థం చేసుకొని అతి చనువును ప్రదర్శించడానికి ప్రయత్నిస్తాడు. అంతటితో ఆగకుండ అవకాశం లభించినప్పుడల్లా తన మిత్రులతో, పరిచితులైన వ్యక్తులతో ఆమెకు తనకు మధ్యనున్న స్నేహానికి అతిశయోక్తులు జోడించి చిన్నచిన్న కథలు, సంఘటనలు కల్పించి చెప్తాడు. ఆమె చుట్టూ ఏర్పడే అపనిందల విషవలయానికి సృష్టికర్త అవుతాడు.

ఈ విధంగా నేటి స్త్రీ ఒకపురుషునితో స్నేహం చేయడంవల్ల, తన చుట్టూ ఉన్న సంఘంవల్ల కొన్ని కొన్ని సార్లు స్నేహం చేసిన వ్యక్తి వల్ల ఎన్నో సమస్యలను ఎదుర్కోవాల్సి వస్తున్నది. అపవాదుల ముళ్ళ పొదల్లో చిక్కుకొని సతమతమయ్యే పరిస్థితులు ఏర్పడుతున్నవి.

అయితే "స్త్రీ—పురుషుల స్నేహం" "కేవలం శారీరిక ఆకర్షణ వ్యామోహాలు" అనే ముఖ్యమైన అభిప్రాయం మన అంతరంగల్లో నుండి పెకిలి వేసిననాడు స్త్రీ పురుషుల మధ్య ఉదాత్తమైన, ఉత్కృష్టమైన స్నేహభావం చిగురించే అవకాశం లేక పోలేదు. ఎంత లోకం మారిందనుకున్నా స్త్రీల కన్న పురుషులకు లోకజ్ఞానం ఎక్కువగా వుంటుంది కనీసం వార్తాపత్రిక కూడా చూడని స్త్రీలే మనదేశంలో ఎక్కువగా వున్నారంటే ఆశ్చర్యపడవలసిన అవసరములేదు ఎయిగురు స్త్రీలు కలుసుకున్నప్పుడు మాట్లాడుకునేవి నగలు, చీరలూ, సినిమాలు. ఏ కొద్ది మందో తప్ప ఇంతకు మించి ఏమీ మాట్లాడరు ఈ రకం సంభాషణలో నెర్చుకునేదేమీలేదు. స్త్రీల స్నేహం పరిమితమైనది. సందర్భం వచ్చినప్పుడు ఒకరి కొకరు సాయం చేయలేరు రామే ఒకరిమీద ఆధారపడినవారు కనుక సాయం చేయగల సామర్థ్యతవుండదు. అదే పురుషునితో స్నేహమైతే సాయం చేయగల అవకాశం ఎక్కువే అందుకే మన ఇతరదేశాలలాగా నిష్కపటమైన స్నేహం వృద్ధి చేసుకోవచ్చు అయితే మనస్నేహంవల్ల ఇతరులకు ఏమాత్రంహానికల్గినా ఆ స్నేహానికి స్వస్తిచెప్పడం మంచిది.







గమనిక

"బసీ ఇంటర్వ్యూలు" అనేవి తపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యం కాదని మా యువ పాఠకులకు మనవి... సం.



# గోదావరి సేవింగ్ సిండికేట్

## మహిళా గ్రూపులో చేరండి!




**ఇది స్త్రీలకు మాత్రమే!**

వెంటనే సభ్యులుగా చేరి **లక్షలు గెలవండి!** మీ తీరిక వేళల్లో సభ్యులను చేరుస్తూ..... **పొదుపులో పొదుపు చేయండి!**

డబ్బుకి హామీ వుంది! **బ్యాంక్ వారి క్యాష్ సర్టిఫికెట్లు** ఇవ్వబడుతున్నాయి!!

మీ మొత్తం పెట్టుబడి రూ. 105లు మాత్రమే!
5 నెలసరి వాయిదాలలో కూడా చెల్లించవచ్చు!!
రూ. 1లక్ష 25 వేల నుండి రూ. 10లు వరకు
మొత్తం రూ. 5 లక్షల 39 వేలు! బహుమతులు 18,739

**మా బ్యాంకర్స్ స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్**

రిజిష్టర్డు ఆఫీసు:
మెయిన్‌రోడ్, రాజమండ్రి

గోదావరి సేవింగ్ సిండికేట్,
సుల్తాన్ బజార్, హైదరాబాద్-1.

బ్రాంచి: గాంధీనగర్, విజయవాడ-3.

GODAVARI/ADS

# హైదరాబాద్ నోట్ బుక్

—తిరుమల రామచంద్ర

### శ్రీ నాయని అస్తమయం :

శ్రీ నాయని సుబ్బారావు జూలై 8వ తేదీ ఉదయం కన్ను మూయడంతో సంప్రదాయాన్ని విడనాడకుండా ప్రణయాన్ని మధురోదాత్తంగా చిత్రించిన ఏకైక నవకవి కన్నుమూశారు. 79వ ఏట ఇంతకాలానికి ఆయనకు ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు కళాప్రపూర్ణ బిరుదం ఇచ్చారు. దానిని ఆ విశ్వవిద్యాలయం స్నాతకోత్సవాల సందర్భంగా విశాఖలో జూలై 8వ తేదీన అందుకోవలసి వుంటేది. ఈ కళాప్రపూర్ణ బిరుదం ఎందుకు నీకు అని ఆయనను విధి లాక్కుపోయిందనిపించింది. ఆయన వంటి పరిణత కవికి 'కళాప్రపూర్ణ' బిరుదం ఎప్పుడో రావలసింది కదా! అని చాలమందికి సందేహం వస్తుంది. కాని. ఆయన అలనాటి నెల్లూరు జిల్లాలో (పొదిలిలో) పుట్టి పెరిగినా, జీవితంలో నెరజాణతనం అలవరచుకొన్నవారు కాదు. చిక్కగా చక్కగా పద్యాలు చెక్కి పెట్టే శిల్పం చేతనైనా, ప్రచారం కోసం మంది మార్బలం చుట్టూ చేర్చుకొనే శిల్పం నేర్వలేదు. జీవిత ప్రవాహంలో రాయిలాల "కత్తి పడవలు" వదలి "తడిసిముడుతలు పడిన ఆ ఎడపనెటులో" తెచ్చుకుని కలతపడే తత్త్వం. శ్రీ సుబ్బారావు ప్రణయావిష్టుడై వున్నప్పుడు రొమాంటిక్ కవులతో ఆయనకు సాహచర్యం కలిగింది. వారిలాగ ఆయనా ప్రణయ కవే అయినారు. కాని, ఆయన ప్రణయం ప్రత్యేక పరమార్థకం. కామినీ కటాక్షవీక్షణ కుతూహలం కాదు, అది ప్రారంభంలో తృతీయ పురుషార్థావలంబి అయినా, తుదకు విశ్వరూపిణి అయిన దేవిపై భక్తిలోని ఊహానుభూతులను దర్శించి ఆముష్మికతతో ధన్యమయింది.

"సుప్రసన్నపు కమ్ర ప్రేమ పవిత్ర భావ
మదియు దాప వసంత కావ్యమునటించ,
నవ్యత నిష్యంది మధుర గీతములలోన
నీకు వినిపించెదను కమనీయమూర్తి"

అని "సాబర్మతి ప్రణయ యాత్ర"లో ప్రియురాలికి అనగోరు తెలుపడంలో ప్రారంభమయిన నాయనివారి తీయని అలపు మాతృ వియోగంతో మమకారపు మరొక కొత్తదనం సంతరించుకొని,

"అవ్యయదయాంబు రాశి నవ్యాత్మ ప్రసన్న
మధురమూర్తి! శ్రీమన్మహామాతృమూర్తి!"

అని ఒకానొక ఉన్నతికి చేరి, "మాతృ గీతాలు"గా మారి, 'అభినవ కృష్ణ లీలల'లోని చిలిపితనంతో చెరలాటలాడి 'సౌందర్య మంజరి'తో

"నీ చరణాంబుజద్వితయ
నిష్ఠితమై వికసించు భాగ్యముల్
నోచుకొనంగ లేకిటుల
లోలత దిక్కులయందు మ్రగ్గెదన్"

అని ఆవేదనతో శ్యామళా వ్రతం చేసి. విశుద్ధి పొంది విశ్వమాతృప్రేమలో తాదాత్మ్యం పొందింది. ఇంతటి పరిణతి కలది గనుకనే నాయనివారి రచనలలోని ప్రణయం కృత్రిమమైంది. ప్రబంధ. భావకవితలలో కనపడేదిలా కాల్పనికమైనది కాదు. కొన్నాళ్ళు నెల్లూరులో సబ్ రిజిస్ట్రారుగిరి చేయడం నరసారావుపేట హైస్కూలు హెడ్ మాస్టర్ గిరి వరకు ఆయన పలుపు పట్టి మెట్టినా, వాటిలోని బాహిర వైవిధ్యం కన్నా అంతరంగంలోని అనుభవ వైవిధ్యమే రచనలలో ఎక్కువ. కనుకనే ఆయన పద్యాలు జీవితం చిల్కొని వస్తాయి. ఆయన అతి నేలమయిన సంయమంతో, అనంతమైన భావనలో పద్యాలు చెక్కి పెడతారు. కనుకనే తిక్కన పదబంధమన్నా పెద్దన మెలకువలన్నా వేమన కథన పద్ధతన్నా ఇష్టం. నాయనివారు ఆంగ్లసాహిత్యమూ అపారంగా చదివారు. కాని, ఏ ఆంగ్ల కవిముద్ర ఆంగ్లంద్వారా చదివిన పాశ్చాత్య కవి ముద్ర ఆయన రచనపై పడలేదు. "కవిత్వానికి నన్ను ప్రేరేపించిన విషయములే. ప్రేమ, మాతృవియోగం, నరసారావుపేటలోను. నరసారావుపేటను వదిలినప్పుడూ కలిగిన బాధలూ నన్ను కవిగా చేశాయి" అన్నారు నాతో ఆయన. ఇటువంటి మార్గాలూ, పరమ్పరభావ దూషితాలూ కావు గనుక ఆయన రచనలు చాలా కాలం. వరదు-నవీనం వేదనవాను దేవం, మాతృగీతాలు, జన్మభూమి- నిలుస్తాయని నా విశ్వాసం. ఉపాధ్యాయవృత్తిలోనే అనుభవం పండి, విరామం నిండారిన ఆయన విద్యారంగ సంస్కరణకు చేసిన సూచనలూ గొప్పవి. "మనం ఎందో పరిభాషను సంస్కృతం నుంచి తెచ్చుకుంటున్నాము. సంస్కృతంలో విదేశభాషా పదాలు ఎన్నో చేరాయి. అలాగే మనం వారిలాగే పదాలను ఇతర భాషలనుంచి స్వీకరించి మలచుకోవచ్చు. దీనివల్ల ఉచ్చారణా ... స్వతంత్రంగా ఆలోచించి పరిశోధనలు జరపడానికి వీలవుతుంది" అని ఆయన అన్నారు. నాయనివారు 1957లో హైదరాబాద్ చేరిన తర్వాత కొంతకాలం రేడియో కేంద్రంలో రచనా ప్రయోక్తగా పనిచేసి, దాదాపు 16 రేడియో నాటికలు వ్రాశారు. ఆయనకు ఐదుగురు కుమార్తెలు, ఒక కుమారుడు, భార్య ఉన్నారు. కుమార్తెలలో ఒకరైన శ్రీమతి నాయని కృష్ణకుమారి ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరు; నాయని వారి అస్తమయంతో ఒక మహాకవి. అంతకుమించి ఒక మహా సత్పురుషుడు అస్తమించారు.

### ఇండియన్ నేషనల్ థియేటర్ ప్రశంసనీయ సేవ :—

రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు అన్నట్టు పుబ్బలో పుట్టి మఖలో మాడే పుట్టగొడుగు సంస్థలు అసంఖ్యాకంగా వెలుస్తూ గిడుతున్న ఈ రోజులలో ఒక సంస్థ-అందులోను నాటకకళకే అంకితమైన సంస్థ సినిమాల తాకిడికి తట్టుకొని నిలబడి నలుగురిని ఆనందింపజేయడం నిజంగా ఒక ఫీటు. అర్థశతాబ్ది కింద వున్నట్టు ఇప్పుడు తెలుగువారిలో నాటకాభిలాష లేదు. అలాంటప్పుడు ఇండియన్ నేషనల్ థియేటర్ 27 సంవత్సరాలపాటు సేవచేసి జనాదరం పొందిందంటే ఎంత ప్రశంసనీయమో చెప్పనక్కరలేదు. ఈ సంస్థ 27వ వార్షికోత్సవం జూలై 3,4 తేదీలలో రవీంద్రభారతిలో జరిగినప్పుడు ప్రదర్శించిన లవకుశ. మైము (మూకాభినయం). కంఠాభరణం నాటకాలను ప్రేక్షకులు విరగబడి వచ్చారంటే. ఈ సంస్థ ప్రజానురంజకత్వం గురించి వేరుగా చెప్పనక్కరలేదు ప్రథమదిన సమావేశానికి ముఖ్యఅతిథిగా వచ్చిన రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి తమ ప్రసంగంలో, "నేటి నాటక సంస్థలు పాత ఇతివృత్తాలుగల పౌరాణిక చారిత్రక నాటకాలతోపాటు సాంఘిక నాటకాలనూ ప్రదర్శించాలి. పట్టణ వాసుల మనస్సులు కరుడు కట్టుకొని వుంటాయి. స్పందింపవు నటులు నాటక రచయితలు పల్లెపట్ల ప్రజల హృదయాలలోకి పోవాలి. వారికి అనుకూలమైన రంగస్థలాలు నిర్మించుకొని, పల్లెటూళ్ళవారి మనస్సును రంజింపచేసే కళను రూపొందించుకొని, వారి జీవితాలను ఇతివృత్తంగా తీసుకొని రూపకాలు రూపొందించాలి. ఇతివృత్తం నవీన మనగానే, ప్రాచీనం ఉపాదేయం కాదని రాదు. ప్రాచీనకళలను కాపాడుకుంటూనే నవీనతనూ గ్రహించి జనానురంజనం చేయాలి" అని చెప్పిన సలహా నేటి కళాకారులందరికీ ఉపాదేయమేనని నా విశ్వాసం. సమావేశానికి పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ రామచంద్రారెడ్డి అధ్యక్షత వహించారు. ప్రారంభంలో శ్రీ ఎం. మదనమోహన్ స్వాగతం చెప్పారు. ప్రధాన కార్యదర్శి శ్రీ కె. కృష్ణమూర్తి వార్షిక నివేదిక చదివారు. శ్రీ కె. రామేశ్వరరావు వందన సమర్పణ చేశారు. రెండవనాటి సమావేశానికి ప్రఖ్యాత చలనచిత్ర నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ముఖ్యఅతిథిగా వచ్చారు. తొలినాడు ఇండియన్ నేషనల్ థియేటర్ బాల విభాగం ప్రదర్శించిన 'లవకుశ' నాటకం రచయిత, నృత్యదర్శకుడు. ప్రయోక్త బాలబాలికలే కావడం మరొక విశిష్టత, నాటకం ఘన విజయానికి ముఖ్యంగా లవకుశ పాత్రధారులైన ఎ. గిరిజ, వి. సంగీత. బాలశివ పాత్రధారి కె.శివానీశంకర్. సంగీత నృత్యనిర్వాహకులు శ్రీ ఎన్.సి.లక్ష్మణాచార్యులు. కుమారి ఇ. లక్ష్మీకాంతం గారలని నా విశ్వాసం. నాటక రచనా మాధుర్యం. గాయనీ గాయకుల. ఇతర పాత్రధారి బాలబాలికల సంపూర్ణ, సమర్థ సహకారం నాటకానికి మరింత వన్నె తెచ్చాయి. మైమ్ (మూకాభినయం)లో పగ్గంలాగడం (తాటిపోరాటం), గాలిపటాలెగుర

[50వ పేజీ చూడండి]



# మ ఫి యా ను మిం చి న 'ట్రియాడ్'



ఆధునిక సమాజాల్లో 'మాఫియా' అన్న మాట మనం తరుచుగా వింటూ వుంటాం. మాఫియా అంటే అర్థం ఒక రహస్య సంస్థగానీ, కొంత మంది వ్యక్తులు గానీ నేరాలు చేయడం. నేర ప్రపంచంలో అమెరికా ఇటలీ మాఫియాలు మకుటంలేని మహారాజులన్న విషయం మనం వింటూ వుం ం. నవలల్లో చదువుతూ వుంటాం. గాడ్ ఫాదర్' అన్న పుస్తకం చదివితే మాఫియా సంస్థ అంటే ఏమిటో అర్థం అవుతుంది.

ఇప్పుడు ఆయా మాఫియాను తలదన్నే మరో అండర్ గ్రౌండ్ సంస్థ వుంటు కు వచ్చింది. దీని పేరు 'ట్రియాడ్'. 18వ శతాబ్దిలో విదేశీ మంచూ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడిన రహస్య సంస్థలు 'ట్రియాడ్స్' అని పిలువబడేవి. కానీ ఇప్పటి 'ట్రియాడ్స్' కీ 18వ శతాబ్దపు ట్రియాడ్' కి ఏవిధా సంబంధం లేదు.

ఇప్పటి 'ట్రియాడ్స్'లో అనేక సాధారణ నేర సంస్థలు వున్నాయి ఇవి బాంకుల్ని, నగల దుకాణాల్ని దోచుకుంటూ వుంటాయి ఆయుధాల మారక ద్రవ్యాల దొంగరవాణా, బ్లాక్ మెయిల్ మొదలయిన కార్యకలాపాలు సాగిస్తూ వుంటాయి

ఈ 'ట్రియాడ్స్' లో సభ్యత్వం అమెరికా — మాఫియా, ఇటలీ మాఫియా లను మించిపోయింది అమెరికా మాఫియాలో 5000 మంది గూండాలు వుండగా 'ట్రియాడ్స్' లో కనీసం లక్షల సంఖ్యలో గూండాలు (గాంగ్‌స్టర్స్) వుంటారు. హాంకాంగ్‌లో ఆయా సంస్థకు 80 వేల మంది సభ్యత్వం వుండగా, మలేషియాలో 12 వేల మంది వున్నారు. థాయ్‌లాండ్, ఫిలిప్పైన్స్, ఇండొనేషియా అండర్‌వరల్డ్ సంస్థలు ఎంతో శక్తివంతమైనవి.

'ట్రియాడ్స్' లో కూడా నిర్మాణ స్వరూపం మాఫియాలో మాదిరిగానే వుంటుంది. 'ట్రియాడ్' లో కూడా ఒక వ్యక్తి అధిపతి అతనికి అనేక మంది సహాయకులు వుంటారు వీరు, వీరి కింద శాఖోప శాఖలుగా వుండే అనేక మందిపై అజమాయిషీ చేస్తూ వుంటారు. 'ట్రియాడ్స్' లో గట్టి క్రమశిక్షణ వుంటుంది. 'బాస్' చెప్పిందే వేదం బాస్ మాట కాదనడం మృత్యువును ఆహ్వానించడమే.

ఈ 'ట్రియాడ్స్' కు వచ్చే లాభాలు అపరిమితం. గతసంవత్సరం ఒక ట్రియాడ్ సంస్థకు చెందిన కొంతమందిని లండన్‌లో అరెస్టు చేసి కోర్టులో విచారణ జరిపి నప్పుడు దిగ్భ్రాంతి కలిగించే కొన్ని విషయాలు బయట పడ్డాయి. ఈ సంస్థ 5,00 000 పౌండ్ స్టెర్లింగ్‌ల విలువ చేసే హెరాయిన్‌ను బ్రిటన్‌లోకి దొంగ రవాణా చేసిందట!

[ సో-వా-సం ]

| పేరు | ఉద్యోగం | పుట్టిన తేదీ | వయసు | విద్య | ఉన్న వ్యాధులు |
|---|---|---|---|---|---|
| మొరార్జీదేశాయి | ప్రధాన మంత్రి | 29- 2-1896 | 82 | బి. ఏ. | సంపూర్ణ ఆరోగ్యం |
| చరణ్‌సింగ్ | మాజీ దేశీయవ్యవహారాల మంత్రి | 23-12-1902 | 75 | బి.ఎస్ సి , ఎమ్.ఏ , ఎల్.ఎల్ బి | తింటే రగదు. ఈమధ్యనే మొదలైన గుండె జబ్బు |
| జగ్‌జీవన్‌రామ్ | రక్షణమంత్రి | 5- 4-1908 | 70 | బి ఎస్ సి. (ఆనర్స్) | కంటిజబ్బు, ఉబ్బసము, కీళ్ళవాపు. గుండెజబ్బు |
| వాజ్‌పేయి | విదేశవ్యవహారాల మంత్రి | 25- 2-1926 | 51 | ఎమ్. ఏ. | వడుం పట్టేస్తూఉంటుంది |
| జార్జిఫెర్నాండెజ్ | పరిశ్రమల మంత్రి | 3- 6-1930 | 48 | ఫిలాసఫీ కోర్సు | పెద్ద వ్యాధులు లేవు. |
| బిజుపట్నాయక్ | ఉక్కు, గనుల శాఖా మంత్రి | 5- 3-1916 | 62 | బి ఎస్ సి పూర్తి కాలేదు కమర్షియల్ పైలెట్ లైసెన్సుఉంది | పెద వ్యాధు లేవు |
| ఎల్. కె. అద్వానీ | రేడియో సమాచార శాఖా మంత్రి | 8-11-1927 | 51 | ఎల్.ఎల్.బి. | పెద్దవ్యాధులు లేవు. |
| చంద్రశేఖర్ | జనతాపార్టీ అధ్యక్షులు | 1- 7-1927 | 51 | ఎమ్ ఏ. | పెద్దవ్యాధుల లేవు |
| బహుగుణ | ఎరువులు, రసాయనాల శాఖా మంత్రి | 25- 4-1919 | 59 | బి. ఏ. | పెద వ్యాధుల లేవు |

—సేకరణ : కృష్ణాజీ

## ది వేనిషింగ్ సిగరెట్

ఆరోజు శుక్రవారం హైదరాబాద్ లాల్ బహదూర్ స్టేడియం కిక్కిరిసిన క్రికెట్ అభిమానులతో కిటకిట లాడుతోంది లక్కీగా నాకేమో రెండు కాంప్లిమెంటరీ పాసులు దొరికాయి ఫుల్‌సూట్స్ వేసుకుని నేనూ, ఫ్రెండ్ సతీష్ వెళ్ళాము. లంచ్ బ్రేక్‌వరకూ ఆట మాంచి జోరుగా సాగింది.

మేము వెస్టిండీస్ టీమ్ కూర్చున్న చోటుకు దగ్గరలో వున్నామేమో లంచ్ టైమ్‌లో వాళ్ళందరినీ పరిచయం చేసుకోవాలని సరదాపడి సతీష్ నన్ను ప్రాణాలు కొరకడంతో, సరేనని క్షణంలో వాళ్ళని సమీపించి వాళ్ళని కలుసుకున్నాము.

వాళ్ళల్లో బ్యాటింగ్ (బ్రహ్మాండంగా) చేసిన ఆటగాణ్ణి సమీపించి లైటగా విష్ చేసి, షేక్‌హేండ్ యిచ్చి, బాటింగ్‌లో అతని నేర్పరి తనాన్ని అభినందిస్తూ ఓ ఆపిల్ పండు చేతిలో పెట్టి సతీష్‌ని పరిచయం చేసేసరికి...

పరీక్షమో కీ యిచ్చిన గడియారంలా క్రికెట్ ఆటమీద తనకున్న ప్రేమాభిమానాల్ని ఒక్కసారి అతనిమీద ఒలకబోసేసరికి, అతను సంతోషంతో జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి తానొకటి నోట వుంచుకుని మా యిద్దరికీ చెరొక సిగరెట్ ఆఫర్ చేశాడు. వాటిని అందుకుని మొహమాటం లేకుండా నోటపెట్టుకుని దీపావళి మతాబులా కాల్చేయడం మొదలెట్టాడు మా సతీష్...

నాకేమో సిగరెట్ కాల్చడం అలవాటు లేదాయె. అయినా వినకుండా "జస్టు ఫర్ కంపెనీ సేక్, ప్లీజ్ హేవిట్" అంటూ ఓ సిగరెట్ బలవంతాన చేతిలో పెట్టాడతను.

"నో థాంక్స్ ప్లీజ్" అంటూ తిరిగి సిగరెట్ అతని చేతిలో వుంచాను.

అతను చూస్తుంటేనే నాకంచే మొండి ఘటంలా వున్నాడేమో, నేను తిరిగిచ్చిన సిగరెట్టును, "ప్లీజ్ హేవిట్" అంటూ మళ్ళీ నాచేతికి అందించాడు.

అట్లా ఆ విధంగా అతనేమో "ప్లీజ్ హేవిట్" అనడం, నేనేమో "నోథాంక్స్" అంటూ సిగరెట్ తిరిగి యిచ్చెయ్యడం

## మాయాజాలం మతికట్టు



ఐదారుసార్లు జరిగేసరికి అక్కడున్న మిగిలిన టీమ్‌లో వాళ్ళందరూ చుట్టూ గుమిగూడారు. ఆ పరిస్థితిలో నామాజిక్ నాలెడ్జ్ ఏదైనా ఉపయోగిస్తుందా అని ఆలోచించసాగాను.

ఇంతలో నాకో ఐడియా తట్టింది!? అంతే! అక్షణం అతని దగ్గరనుంచి టటాలున సిగరెట్ అందుకుని, అందరికీ కనిపించేలా చూపించి, 1వ చిత్రంలో చూపిన విధంగా పట్టుకుని, 2వ చిత్రంలో చూపిన విధంగా సిగరెట్‌ని పిడికిలిలోకి పోనిస్తున్నట్లుగా కోటు అంచుకి అడ్డంగా కుట్టబడిన జేబులోకి క్షణంలో పోనిచ్చి, 3వ చిత్రంలో చూపిన విధంగా "హూష్" అంటూ ఖాళీ చేతులు చూపించాను.

అంతే! సిగరెట్ మాయం!!

ఒక్కసారి అందరూ 'మార్వెలస్' అనడం, ఆ మరుక్షణం ప్రదేశమంతా చప్పట్లతో దద్దరిల్లి పోయింది

రహస్యం : మీరూ యిలా అగ్గిటమ్ చెయ్యదల్చుకుంటే చిత్రంలో చూపిన విధంగా కోటు బటన్ అంచుకి అడ్డంగా కింగ్ సైజ్ సిగరెట్ పూర్తిగా దూరేలా ఓ జేబు కుట్టించుకుని, చిత్రంలో చూపిన విధంగా అత్యంత వేగంగా ప్రదర్శించాలి.

గమనికలు : కోటు అంచున అడ్డంగా కుట్టబడే పాకెట్ కింగ్‌సైజ్ సిగరెట్ పట్టేదిగా వుండడం ఎంతైనా అవసరం. సిగరెట్‌ని పిడికిలిలోకి పోనిస్తున్నట్లుగా కోటు అంచు సొరుగులోకి అత్యంత వేగంగా పోనివ్వాలి ఒకవేళ వేగం తగ్గించి పోనివ్వారనుకోండి.. ఎంతే సంగతులు

— భావరాజు కామేష్

## అవీ...ఇవీ...అన్నీ

### నాస్తికత : అభివృద్ధి చరిత్ర

శ్రీ 'లవణం' రచన పంద పేజీల పుస్తకం. మధ్య మధ్య అంతర్జాతీయ నాస్తిక ప్రముఖుల ఫోటోలు కూడా ప్రచురించారు. వెల 4 రూపాయలు ప్రతులకి నాస్తిక కేంద్రం పటమట విజయవాడ-6 కి వ్రాయాలి.

### రాత్రి

అధునిక యువ కవి వెఎస్స్. కవితా సంపుటం 'రాత్రి' 50 పేజీల పుస్తకం వెల మూడు రూపాయలు. ప్రతుల కొరకు టీరియస్ పబ్లికేషన్స్ 266, యూనివర్సిటీ, తిరుపతికి వ్రాయాలి.

### పాలికేక

వంగపండు ప్రసాదరావు పాడుతుండికి వీలుగా సరళంగా వ్రాసిన జానపద గీతాలు విశాఖ రచయితల సంఘంవారు ప్రచురించారు. వెల రు 2-50 ప్రతులకు పి. వి రమణ, బోడ్డు బ్రహ్మ విశాఖపట్నం-1 కి వ్రాయాలి.

### యుద్ధ కాండము

244 పుటల గ్రంథం. శ్రీ దివాకర్ల వేంకట సుబ్బారావు రచన. వెల 12 రూపాయలు ప్రతులకు శ్రీ వెంకటేశ్వర బ్యాంకు విక్రేతలు, 7, చక్రపాణివీధి, మాంబళం, మద్రాసు-33.

### భక్త మాచయ్య

డా॥ మానెపల్లి సత్యనారాయణ రచించిన యక్షగాన ప్రబంధం వెల మూడు రూపాయలు. ప్రతులకి సోమలతా పబ్లికేషన్స్ ఖమ్మం వ్రాయవచ్చును.

### యోగము-వాదము

(పరిశోధనా వ్యాసము) రచన డా॥ గోరంట్ల మదనమోహనరావు 28 పేజీలు. వెల 10 రూపాయలు. ప్రతులకు రచయిత పేర టిమ్మ సముద్రం (పోస్టు) ...అప్పటికి తాలూకా, ప్రకాశం జిల్లాకు వ్రాయాలి.

# హైదరాబాద్ నోట్ బుక్

(46 వ పేజీ తరువాయి)

వేయడం, చేపలు పట్టడం బాలబాగున్నవి. ఈ ప్రదర్శనంలో పాల్గొన్న వారినందరిని అభినందిస్తున్నాను. రెండవనాడు ప్రదర్శించిన కంఠాభరణం నాటకానికి రవీంద్రభారతి బాల్కనీ కూలిపోతుందా అన్నంతగా ప్రేక్షకులువచ్చారు. నాటక పాత్రధారులందరూ డిస్టింక్షన్ మార్కులు సంపాదించారనే అనాలి. వ్యష్టిగా చూచినా, సమిష్టిగా చూచినా ఈ ప్రదర్శనం అనదృశంగా వుంది (రంగస్థలమే బాగులేదనిపించింది. నటకులలోని చైతన్యానికి అనుగుణంకాని రంగస్థలం! ఎంతలాగినా పడనితెరలు, రంగానికీ రంగానికీ మధ్య కాలహరణం విశేషంగా జరిగే ఏర్పాట్లూ-ఏంచెప్తాం! మనకు రవీంద్రభారతే గొప్ప! మహారాష్ట్ర రంగస్థలం, కన్నడ నాటక రంగం రంగస్థల నిర్వహణలో ఎంతముందుకు పోయాయో చూస్తే, మనంఏమూలలో ఏయుగంలో వుండేదితెలుస్తుంది. ఈ పరిస్థితిలో మనం వీధి భాగవతాలలాగనో, ఆధునిక ఒపేరాలలాగనో ఒకే తెరతో నాటకాలు ప్రదర్శించడం మంచిదేమో!) శ్రీ వి.కె. రాధా (రాధాకృష్ణమూర్తి) దర్శకత్వమే కాక, కృష్ణరావు వంతులు పాత్రను గొప్పగా నిర్వహించారు. శ్రీమతి శకుంతల సుందరి పాత్రను మిన్నగా నటించారు తక్కిన వారంతా ప్రధాన పాత్రలకు అనుగుణంగా అన్యూనాతిరిక్తంగా నటించారు-వారిసందరినీ ప్రత్యేకంగా పేర్కొనడంఅవసరమే. రామశాస్త్రిగా శ్రీ జి ఎస్ ఎస్. శాస్త్రి నటనలోని సరళత, సుబ్బిశెట్టిగా శ్రీ సి హెచ్. భాస్కరశర్మ నటనలోని సహజత, కార్పణ్యం, రుక్మిణిగా కుమారి సముద్రాల రాజేశ్వరినటనలోని అమాయకత, సౌకుమార్యం, సుబ్బలక్ష్మిగా శ్రీమతి మల్లాది విజయలక్ష్మి నటనలోని ఆకులత, ఉత్కంఠ, నవాబ్‌గా శ్రీ ఎం. శేషగిరిరావు నటనలోని మూర్ఖత, దర్పం, కోర్టుగుమాస్తా రంగాచారిగా కే. కామేశ్వరరావు నటనలోని నిస్సహాయత, ఆశుకవులుగా చిల్లర కృష్ణమూర్తి, అక్కిరాజు సుందరరామకృష్ణం నటనలోని గంభీరతనం ప్రేక్షకుల మనస్సులలో ముద్రితమైపోయాయి. అర్ధశతాబ్ది క్రితం రచన అయిన కంఠాభరణాన్ని ఇప్పటివారి అభిరుచికి అనుగుణంగా దర్శకులు శ్రీ వి.కె రాధాకృష్ణమూర్తి ఎంతో ఎడిట్ చేశారు అయినా సుబ్బలక్ష్మి రామశాస్త్రి సుబ్బిశెట్టి ఇంట్లో తారసిల్లినప్పటి వాత్సల్య సంభాషణను మరికొంత తగ్గించవచ్చు. ప్రేక్షకులు విద్యావంతులయినప్పుడు తగ్గించకపోయినా పరవాలేదు. ఈ రెండు నాటకాలతోను, మూకాభినయంతోను రెండురోజులు ప్రేక్షకులకు కనులవిందు, వీనులవిందు, మనసు విందుచేసిన ఇండియన్ నేషనల్ థియేటరును, కుమారి ఇ. లక్ష్మికాంతంను, శ్రీ వి.కె. రాధాకృష్ణమూర్తిని అభినందిస్తున్నాను.

ఉపశ్రుతి :

లోపల సంగీత ప్రదర్శన జరుగుతున్నది. వెలుపలినుంచి ఒక శ్రోత ఆత్రంగా వచ్చి, ప్రదర్శనశాల తలుపులు మూసివుండడం చూచి "తలుపులు తీయండయ్యా లోపలికి వెళ్లాలి." అన్నాడు. ద్వారరక్షకుడిలో "అయ్యా తమరు ఒక్కరికోసం తలుపులు తీస్తే, లోపలివారు చాలమంది వెలుపలికి వచ్చే ప్రమాదం వుందండీ." అన్నాడు ద్వారరక్షకుడు.

## అవీ - ఇవీ - అన్నీ

సౌజన్య సాహితీ కథా సంకలనం

హితశ్రీ, శార్వరి, దోనెపూడి రాజారావు, కె.వి. కృష్ణ కుమారి, చివుకుల పురుషోత్తం, మల్లాది వెంకట కృష్ణమూర్తి, యమ్ డి. సౌజన్య వి.వి.యస్.వి. కుటుంబరావు 'వసుంధర', వద్దమన్నాటి లక్ష్మీ ప్రసన్న, ప్రభాపతి రవీంద్ర కె రవీంద్రప్రసాద్, డా॥ పి.వి.కె. రావ్, డా॥ పోతుకూచి వెంకటేశ్వర్లు, ముంగర. మోటూరి దుర్గాప్రసాద్‌రావు హర్షవర్ధన్ పసుపులేటి, వెంకటరమణ, వృద్ధ మిత్ర మున్నగు ప్రాచుర్యంగల 20 మంది రచయితల కథలను ఎమ్.డి నఫీజుద్దీన్ సంకలన కర్తగా రవీంద్ర ప్రసాద్ సంచాలకునిగా తెనాలి మంచి సౌజన్య సాహితి అనే సంస్థ వెలువర్చిన ఆధునిక కథల సంపుటి (190 పుటలు) మా కార్యాలయం చేరింది ముఖచిత్రం శంకర్. వెల 8 రూపాయలు ప్రతులకు నఫీజుద్దీన్ సౌజన్య సాహితి నాజర్‌పేట తెనాలికి వ్రాయవచ్చును.

## ఫాలాక్షుని డైరీ

(12 వ పేజీ తరువాయి)

మోటారు సైకిల్ ప్రమాదాల్లో మరణాలు

ప్రపంచ దేశాలలో మనదేశంలోనే మోటారు సైకిలు ప్రమాదాలలో మరణించే వారి సంఖ్య ఎక్కువట. ప్రతి పదివేల మోటారు సైకిలు ప్రమాదాలలోనూ అరవై య్యాయిదుమంది దెబ్బలు దావులతో తేలుతున్నాయట. మిగతాల్లో ఎక్కువ భాగం అంగవైకల్యంలో చిరుతోందట.

సేలం రైతుల అర్ధనగ్న ప్రదర్శన

సేలం వ్యవసాయదారులు ప్రభుత్వపన్నుల పైఖరి నిరసనగా ఊరేగింపు జరిపారట అవూరేగింపులో నూటపదకొండుమంది గోచీలతోనూ, 200 కొంపలు దంతలలోనూ వున్నారట ఈ విధంగా అసభ్యంగా, సంపూర్ణ (పూర్తిగాకాదు) నగ్నంగా వీధుల్లోన తిరిగినందువల్ల వారిని పోలీసు అరెస్టు చేసిందట.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**



రాగరంజితం, మనోరంజితమైన
మీ మనసుకి, నిత్యనూతనత్వం
కోరే మీ వయసుకి, అందమైన
మీ చర్మరక్షణకు
రూపాష్®
శాండల్‌వుడ్ పౌడర్లనే
వాడండి
ROOPASH
ROOPASH
విజయకెమికల్ & టాయిలెట్ వర్క్స్ (తెలంగాణా)
మద్రాసు-7 వారి మరియొక అత్యుత్తమమైన తయారి
ఆంధ్ర, ఒరిస్సా రాష్ట్రములకు
స్టాకిష్టులు, డిస్ట్రిబ్యూటర్లు కావలెను.